





# మహిళలు

విలువ,ధర్మాలు

# స్త్రీ విలువ





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 9000000004316

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# స్త్రీ విలువ

అనువాదం :

లవణం

ప్రకాశకులు :
భవాని పబ్లిషింగ్ హౌస్, వుయ్యూరు.
(కృష్ణాజిల్లా)

# స్త్రీ విలువ

మణి - మాణిక్యాలు సాధారణంగా దొరకవు కనుక అవి చాలా విలువైనవి. ఆ దృష్టితో చూస్తే స్త్రీ విలువ నగణ్యం. ఎందుకంటే స్త్రీలు దొరకనివారుకారు కాదుగా. నీరు మన దైనికోపయోగంలోనిది; అందుచేత దానికి విలువలేదు. కాని ఆ నీళ్ళకే కరువు ఏర్పడితేమాత్రం రాజాధిరాజులుకూడ ఒక్క నీటిచుక్కకు తమ కిరీటంలోని రత్నాలనుకూడా తీసి యివ్వడానికి వెనుకాడరు. ఎప్పుడైనా ప్రపంచంలో స్త్రీలు అరుదైపోతే, అలా ఇది జరుగకుండుగాక — స్త్రీలయొక్క యదార్థవిలువ మనకు తెలుస్తుంది. అంతేకాక ఆ విలువను గురించి తుదినిర్ణయంకూడా చేయబడుతుంది. కాని నేడు స్త్రీలు తేలికగా దొరుకుతున్నారు గనుక అది సంభవంకాదు.

కాని ఈ విలువ కనిపెట్టడానికి ఒక విధానం ఉన్నది. అంటే పురుషులకు ఎప్పుడు, ఎలాంటిపరిస్థితిలో, ఏ సందర్భంలో స్త్రీల అవసరం ఎంతవరకూ వుంటుందో మనం తేల్చుకుంటే ఇక మరి కాగితం కలం తీసుకుని లెక్కకట్టగలుగుతాము. అయితే రొక్కంగామాత్రం మన కా విలువ ముట్టకపోవచ్చు.

ఒక ఉదాహరణతో ఈ విషయాన్ని స్పష్టపరుస్తాను. సాధారణంగా మన యిళ్ళల్లో వితంతుసోదరికంటే భార్య అవసరమే ఎక్కువగా ఉంటూఉంటుంది. అందుచేతనే భార్య విలువకూడా ఎక్కువ. కాని భార్యకు పురిటిరోజులు వస్తే మాత్రం ఆ వితంతుసోదరివిలువే హెచ్చుగావుంటుంది. ఎందువల్లనంటే ఆసమయాల్లో ఇంటిపనులు-వంటపనులు చూచుకోవ

డానికీ, ఏ కాకమ్మకథలో చెప్పి చిన్నపిల్లల్ని మరిపించి సంబాళించడానికీ మనుషులు అవసరమౌతారుగదా.

ఇలా చూస్తే స్త్రీ భార్యగా ఉన్నప్పటి విలువకంటె సోదరిగా—అందులోనూ వితంతు సోదరిగా ఉంటే ఆమె విలువ తగ్గింది. ఇది అతిసరళము, స్పష్టమైనవిషయం. ఇందుకు భిన్నంగా ఏవాదనా నిలవదు. పలక బలపం తీసుకుని లెక్కలు వెయ్యటానికే కూర్చుంటే ఏపరిస్థితిలో స్త్రీకి ఎంత విలువ వుంటుందో అణాపైసలతోసహా చెప్పివేయవచ్చును.

మాటవరుసకి పరిస్థితులనుబట్టి స్త్రీలకు కలిగేవిలువ తెలిసినదనుకొందాం. కాని కొంచెం ఆలోచిస్తే, స్త్రీకొరకే బంగారంవంటి లంక నాశనమైనప్పుడు, ట్రాయ్ రాజ్యం ధ్వంసం అయినప్పుడు, ఇంకా చరిత్ర లిపిబద్ధంచెయ్యని ఎన్నో చిన్నపెద్ద రాజ్యాలు స్త్రీలకొరకు ధరాతలంలో కలిసిపోయినప్పుడు — ఈ స్థితిలో స్త్రీత్వంయొక్క విలువను ఎలా నిర్ధారణ చేయగలమూ అనేది ఒకప్రశ్న. సామ్రాజ్యాలనుకూడా లెక్కచేయక, అవసరమైనప్పుడు ప్రాణత్యాగాలకుకూడా పురుషులు సిద్ధపడ్డారంటే స్త్రీయొక్క అంత గొప్ప ప్రయోజనమేమిటో? ఈ విలువలు సరిచూడాలంటే ఇంక నీ పలకలో మిగిలిన స్థలమెంత ? కాని స్థూలంగా చూస్తే పురుషుడు ఈ కృత్యాలన్నీ చేసినపుడు రాజ్యంవంక చూడలేదని నిశ్చయమౌతుంది. కాని, అయితే ఇదంతా చేసినప్పుడు ఇందులో స్త్రీముఖం చూచి ఎంతచేశాడు, తన నిగ్రహంలేని విశృంఖలప్రవృత్తితో చూచి ఎంతచేశాడా అని చూడాలి. దీనికి జవాబు ఎవరుయిస్తారు ?

స్త్రీవిలువ ఏమిటి? అంటే వాళ్లు ఎంతవరకు సేవాపరాయణులుగాను, కష్టాలు-దుఃఖాలు మౌనంగా సహించి ఊరుకోగలిగేవారుగాను ఉండగలరు? అంటే వారివల్ల పురుషులకు ఎంతవరకూ సుఖం, సౌకర్యం లభిస్తున్నాయి? వారెంత అందంగావున్నారు? పురుషుని కోరికలను వారు ఎంతవరకు తీర్చగలుగుతున్నారు? ... ప్రపంచచరిత్ర తెరచిచూసి స్త్రీల విలువలను తెలుసుకునేమార్గం ఇంతకంటే మరొకటి లేదని నిరూపించగలము.

"మీరు స్త్రీ విలువను ఎరుగరు; వారి గౌరవాన్ని అర్థంచేసుకోరు; వినోద-విహారాల్లో వారిని పాల్గొననివ్వకుండా నాలుగుగోడలమధ్య బంధించి ఉంచుతారు. అందుచేత మీరు అనాగరికులు" అని ఐరోపీయులు ఈ దేశస్థులవైపు వ్రేలుచూపించి చెబితే, మనువు మొదలైనవారి గ్రంథాలనుండి 'పూజార్హా' వంటి శ్లోకాలను వారికి జవాబుగా ఉదహరించి మనం అంటాంగదా—"మేము మా తల్లులనూ, అక్క-చెల్లెళ్ళను వారి ముఖాలపై రంగులుపులిమి, వారిచే షాంపేన్, క్లారెట్ త్రాగించి, ఉత్తేజపరిచి మీలాగా సభల్లోనూ, సమావేశాలలోనూ నృత్యంచేయిస్తూ త్రిప్పము. ఇంటిమూలల్లోనే ఉంచి వారిని మేము పూజిస్తాము. మీ బాల్-డాన్సు దుస్తులు చూచి మేము సిగ్గుతో తలవాంచుకుంటాము. మీ నృత్యం చూచి కళ్లుమూసుకుంటాము. మేము అనాగరికులుగానేవుండి మా తల్లులను, అక్క-చెల్లెళ్ళను ఇళ్ళల్లోనేవుంచి పూజిస్తాముగాని, వారి గౌరవాన్ని అధికం చెయ్యాలని బహిరంగంగా గుంపుముందు నృత్యంచెయ్యనివ్వము." ఈ జవాబును

ఐరోపీయులు తెక్కే చేయ్యరు. సుప్రసిద్ధ ఆచార్యుడు ప్రొఫెసరు మెస్పరో 'Dawn of civilisation' అనే గ్రంథంలో ప్రాచీన ఈజిప్టుదేశంలోని స్త్రీలను గురించి వ్రాస్తూ, వారు తమరోమ్ముల్లను అనాచ్ఛాదితంగా ఉంచు కుని వీధుల్లో కూడా తిరుగుతూవుండేవారనీ, అందుచేత వారు ఉచ్ఛస్థితిలో ఉండేవారని అని వ్రాశారు. ఎందుచేతనంటే "Like Europeans they must have coveted public admiration" "ఐరోపీయులవలెనే వారుకూడా ప్రజలచే ప్రశంసింపచేసుకొనుటకు ఉవిళ్ళూరుతూ ఉండేవారేమో" అనేదివిషయం నిజంకావచ్చు. దాన్ని కాదనలేముగదా!

తమ స్త్రీలనుగురించి వారు నిస్సంకోచంగా చెప్పగలి గారు. కాని, ఆ admiration అనే పదాన్ని మన దేశభాష లోకి సరిగా అనువదించాలంటే సిగ్గుచే మనతల వంగిపోతుంది. ఏమైనా— "మేము వారిని సమూహాల్లో నృత్యం చేయించ లేము" "ఇంటిమూలల్లోనే ఉంచి వారిని పూజిస్తాము" అనే సమాధానంకూడా అంత తీసిపోయిందికాదు. అందుచేత వాద నల్లో ఎలాగో అలాగ గెలిచి మను, పరాశరులను నెత్తిమీద పెట్టుకుని పరస్పరం ధైర్యం చెప్పుకుంటూ ఇళ్ళకు తిరిగి వస్తుంటాము.

ఏదొరలతోనైనా వాగ్వివాదాలువస్తే ఆ సమయంలో తప్పించుకోవద్దని అనంగాని, ఇంటికివచ్చిన తర్వాత అన్నద మ్ములం పరస్పరం "సోదరా, మనం వారిని పూజిస్తున్నాం నిజమే కాని, ఎలా పూజిస్తున్నామో చెప్పు?" అని ప్రశ్నిం

చుకుంటే, బహుశః బయటవారికి తెలియనివ్వరానివిధంగా తయారౌతుంది సమస్య. అందుచేత దీనినిగురించిన విమర్శ ఏకాంతంలో చేసుకోవడమే మంచిది.

స్త్రీకి పాతివ్రత్యాన్ని మించినది మరొకటి లేదని అన్ని దేశాలపురుషులు అంగీకరిస్తారు. ఎందుకంటే పురుషుల దృష్టిలో అన్నిటికంటే శ్రేష్ఠమైనది ఇదే. తనభర్త ఎంత దుష్టుడైనా, ఆయన ఆజ్ఞను జవదాటడం లేక అవహేళనచేయడంకంటె స్త్రీకి ఘోరమైనదోష మింకేముంటుంది. ఇందు ప్రతిమాట మరోమాటను పూరించేది, దాని కవసరమైనదీ అవుతుంది. ఈ పాతివ్రత్యము స్త్రీకి ఎంతముఖ్యధర్మమై యున్నదో మన రామాయణం, మహాభారతం మొదలుగాగల పురాణాలన్నీ చర్చించాయి. ఈ విషయమై మరేమీ చెప్పనవసరం లేనంత హెచ్చుగా మన దేశంలో ఇప్పటికే చాలామంది చెప్పారు. స్వయంగా భగవంతుడే ఈ పాతివ్రత్యవిసురులో చిక్కుకుని ఎన్నోసార్లు విహ్వలుడైపోయాడు.

కాని ఈ వాదనలన్నీ ఒక్కవైపువే; స్త్రీకి సంబంధించినవి మాత్రమే. ఎంత వెతికినా పురుషులకు కూడా బాధ్యతలున్నాయని, నియమాలున్నాయనే విషయం ఎక్కడా కానరాదు. కాని ఇంత పెద్ద ప్రాచీనదేశంలో పురుషులనుగురించి ఏమీ చెప్పబడలేదని మనం గట్టిగా అంటే శిఖపట్లగోత్రంగా పరిణమిస్తుందేమో! లేకపోతే ఈ విషయాన్ని స్పష్టంగా చెప్పివేసేవాళ్ళమే. ఇంగ్లీషువారుకూడా Chastity (పవిత్రాచరణ) ఉండాలని అంటారు. అయితే వారు చెప్పే పవి

త్రాచరణ స్త్రీ పురుషు లిద్దరికీను. కాని మన దేశంలోని 'సతీత్వం' అర్థం ఒక్క స్త్రీలకు మాత్రమే వర్తిస్తుంది. శాస్త్రకారులు అడవుల్లో కొండల్లో ఉండేవారనే విషయం నిజమే. కాని తమ సోదరులనుగురించి ఒక్కమాటకూడా చెప్పి వారిని ఆశాకర్యానికి లోనుచెయ్యాలని వారనుకోలేదు. వారు స్త్రీని వశపరచుకొనుటకు బహిరంగంగానే అవకాశం వొదిలారు. చివరికి రాక్షసవివాహం కూడా వివాహమేనని చెప్పారు! పురుషులయెడల ఆ శాస్త్రకారుల కింత దయ! ఇంత సానుభూతి! లేకపోతే పురుషులు వారిని ఒప్పుకునేవారా? ఈ యిరవయ్యో శతాబ్దంలోకూడా వితంతువివాహాలు ఉచితమా? అనుచితమా? అనే విషయానికి కూడా వారివద్దకే పరుగెడుతారా? ఏనాటో ఆ గ్రంథాలన్నీ కట్టగట్టి గంగలో పారేసి తమ యిష్టంవచ్చినట్లు క్రొత్తశాస్త్రాలు వ్రాసుకొనేవారు.

ఏమైనా స్త్రీకి పాతివ్రత్యం ఉందిగాని, పురుషునికి ఏమీ లేదనేది నిశ్చయమైపోయింది. అంతేకాక పాతివ్రత్యం యొక్క చరమావస్థ సహగమనం.

ఈ సహగమనం ఎప్పుడు ఎలా ఆచరణలోనికి వచ్చిందో చరిత్రలో లేదు. తనభర్త మరణించినపుడు కౌసల్య ఒకసారి కోపంవచ్చిన సందర్భంలో సహగమనం చేస్తానని బెదిరించినట్లు రామాయణంలో ఉంది, కాని చివరకు ఆమెకోపం చల్లారిపోవడంతో పాపం దశరథుడు ఒంటరిగానే చితిపైకి ఎక్కవలసివచ్చింది! ఈ గ్రంథంలో ఈ విషయమై మరే ప్రస్తావనా లేదు. అందుచేత ఆనాడు సహగమనాన్ని గురించి

ప్రజలకు తెలిసినా వారు దాన్ని ఎక్కువగా కార్యరూపంలోనికి తీసుకురాలేదని తెలుస్తోంది. మహాభారతంలో మాద్రి తప్ప మరెవరూ సహగమనంచేసినట్లు లేదు. కురుక్షేత్ర సంగ్రామానంతరం కొన్ని సహగమనాలు జరిగాయి. కాని అవి చాలతక్కువ. కనీసం ఆనాడు స్త్రీలు సహగమనం చేసితీరాలని పురుషులు పోటాడినట్లుమాత్రం లేదు. అంతే కాక సహగమనం ఎక్కువగా అనాగరికజాతుల్లో ఆచరింపబడు తూండేది. దక్షిణ దేశంలో ఇట్టి సతీమణుల కీర్తిసంభాలు చాలాఉన్నాయి. మన అదృష్టంకొద్దీ ఆఫ్రికా, ఫిజీదేశాలలో ఈ ఆచారం లేకపోయింది. కాకపోతే నేను మనం ఆ దేశాల్లో అడుగుపెట్టుటకు కూడా స్థలం ఉండేదికాదేమో! ఒకొక్క "డామోహీ" నాయకుడు చనిపోతే అతనికుండే వందలకొద్దీ భార్యలుకూడా అతనిసమాధికి దగ్గర్లోఉన్న చెట్లకి వ్రేలాడతీసి ఉరితీయబడేవారు. అంటే ఆ వితంతువులను కూడా భర్తతోపాటు పరలోకానికి పంపేవా రన్నమాట. పరలోకంలో సంగతులు ఎవరికీ స్పష్టంగా తెలియవు. అందు చేత అక్కడ మృతపురుషులకు స్త్రీలు దొరక్కపోతే ఇబ్బంది పడిపోతారేమోనని ఇదంతా! తెలివైనవాళ్ళకి కష్టాలుండవు. అందుచేత సమయం మించకుండానే జాగ్రత్తపడాలి! బహుశః మన దేశంలోకూడ సహగమనానికి కారణం ఇదే అయి ఉండవచ్చు. అశోకుని రాజ్యం చూచినవారు అప్పుడు ఆర్యా వర్తంలో భర్తతోపాటు వితంతువుని కూడా చితిమీద కెక్కించే ఆచారం ఉండేదికాదంటారు. అయితే దక్షిణ దేశంలో ఉండేది. ఆర్యావర్తంలోనివారు ఈ విష

యమైె తెలుసుకున్నప్పుడు, అనాగరికులు అనాగరికులే అయినా బలే ఉపాయం ఆలోచించారే, అని అనుకున్నారు. నిజమేకదా మరి—వాస్తవంగా పరలోకం అంటూ ఒక టుంటే అక్కడ సేవచేసే దెవరు? అంతే—ఇక దాంతో వారూ ఆ ఆచారాన్ని అవలంబించి ఎంతోమంది వితంతువు లను చితిపైకి ఎక్కించారు అది చూస్తే స్పెయిను రాజు ఫిలిప్‌కు కూడా ఆశకలిగివుండేది.

ఈవిధంగా 'అదృష్టవంతు'లైన స్త్రీల పూజాసామగ్రి సమకూర్చబడసాగినది. కాని తమ వంశగౌరవంకోసం హితం కొరకు స్వయంగా తీసుకువచ్చి ఇంట్లోపెట్టుకున్న ఆమెను— ఒకొక్కప్పుడు ఎన్నో యుద్ధాలుచేసి, మోసము, మాయో పాయంలతో - చివరకు ఆమెను ఎత్తుకురావడం కూడా జరి గిందే - అట్టియామెను ఎలా హత్య చేయడం? దానికి చాలా కారణాలున్నాయి. అందులో మొదటిది: పరలో కంలో పురుషునికి సేవ ఎవరుచేస్తారు? రెండవదేమంటే, అదృష్టవంతురాలైపోయినప్పుడు ప్రత్యేకంగా ఆమె ఉపయోగం ఏముందికనక? అంతేకాక ఆమెవల్ల భవిష్యత్తులో ప్రమా దాలు జరుగుటకు అవకాశాలున్నప్పుడు, ముందుగానే జాగ్రత్త పడడం మంచిదిగదా. ఈ సందర్భంలో ఏవ్యక్తికైనా ఏ స్త్రీతోనైనా గల ప్రత్యేకసంబంధాల విలువను మనం గుర్తిస్తే, ఎన్నోసమస్యలు వాటంతట అవే తీరిపోతాయి. అయితే ఒక్క సంబంధం విషయంలో మాత్రం చిక్కువస్తుంది; అదే మాతృసంబంధం. దానివిషయం తర్వాత ఆలోచిద్దాం.

చరిత్ర చదివినవారికి వితంతు వివాహాలయెడల ఏ దేశంలోనూ ఆదరం చూపబడలేదని తెలుస్తుంది. అందరూ కూడా అయిష్టతతోనే చూస్తూవచ్చారు. అలాంటప్పుడు వితంతువివాహాలు నిషేధమైవుండి, కొన్ని దేశాలలో వితంతువులను చితిమీంది కెక్కించి చంపివేయడమే శ్రేయస్కర మనుకున్నారంటే ఆశ్చర్యపడనక్కరలేదు. ఇదంతా సిగ్గుపడవలసినదే; కాని, పతిహీనయైన స్త్రీకి ఈ ప్రపంచంలో వేరే అవసరంలేనప్పుడు, ఆ వితంతువును ఆలోకంలోకి పంపితే, కనీసం భర్తకైనా పనికివస్తుందిగదా అనే ఆశయం ఈ ఆచారంలో యిమిడిఉన్నదంటే తప్పనిసరిగా ఒప్పుకోవలసివస్తోంది. భర్త మరణంతో భార్యకూడా వధింపబడే ఆచారంఉన్న అన్ని దేశాలలోనూ ఇట్టినమ్మకమే ఉన్నట్లు తెలుస్తుంది. మృతవ్యక్తి ఆత్మ ఏ చెట్టుమీందనో, గాలిలోనో తన భార్యకోసం నిరీక్షిస్తూఉంటుందనీ, కనుక వీలైనంతత్వరలో భార్య ఆత్మనుకూడా అతనివద్దకు పంపడం ఉపకారమేననీ వారు అనుకునేవారు.

కాని, మన దేశం—ఆ ప్రాచీనకాలంలోనే ఆత్మస్వరూపం కూడా నిర్ణయింపబడి, భగవంతుని లోతుపాతులుకొలిచిన దేశంగదా! అలాంటప్పుడు ఇక్కడి గొప్పగొప్ప పండితులు కూడా స్త్రీని వధించి ఆమె ఆత్మను భర్తవద్దకు పంపగలమని నమ్మేవారంటే ఆశ్చర్యం కలుగుతుంది. అయితే, ఇది స్త్రీ పూజలో ప్రత్యేకవిధానం అయితేమాత్రం అది వేరేవిషయం. భర్తతోపాటు సహగమనం అనేది స్త్రీకి సర్వోత్కృష్ట ధర్మ

మని పురుషులు నచ్చచెప్పారు. భర్తృసేవమినహా స్త్రీకి మరోపనిలేదని మనువుకూడా చెప్పాడు. ఆమె ఈ లోకం లోనూ భర్తసేవచేసింది; పైలోకంలోనూ చెయ్యాలి. ఐతే ఆమె పరలోకంలో యీసేవ ఎప్పుడు చేస్తుంది, ఎన్నిరోజుల తర్వాత సేవచేస్తుంది అనే నిర్ణయాలుచేసేచిక్కులో వారు పడదలచుకోలేదు. పురుషుడు ఆలస్యాన్ని సహించలేడు. అందుచేత స్త్రీని అక్కడికి పంపడంవిషయంలో చాలా త్వర పడడం ఉత్తమంఅనుకున్నారు. శాస్త్రాలలో స్త్రీ మాతృ త్వంవల్లనే పూజ్యురాలౌతుందన్నారు; అలాంటప్పుడు మాతృత్వం ప్రాప్తించకపోతే ఆమె ఉపయోగం ఏముంటుంది? ఆ తర్వాత చిన్నపే-పెద్దపే కీర్తిగాథలెన్నో తయారుచేయబడి పురాణాలు, కథలలో స్త్రీవిలువ పెరిగింది. పురుషుడు కేవ లము తన సుఖం, సౌకర్యం మాత్రమే చూచుకుంటాడు — ఆ సుఖం, సౌకర్యం వాస్తవమైనా, కల్పించుకున్నదైనాసరే. కాని ఈ అసలువిషయాన్ని దాచి "ఏ దేశంలో అయితే స్త్రీలు మరణించిన తనభర్త పాదపద్మాలను తనఒడిలో పెట్టు కుని కూర్చుని, అతనితో నవ్వుతూ ఆ చితిలో భస్మమౌతారో ఆదేశం చాలాగొప్పది!" అంటూ రకరకాలుగా ప్రచారంచేశారు.

ఇదే నిజమైతే భర్త మరణించగానే వితంతువుకు భంగు, ఉమ్మెత్తరసం యిచ్చి ఆమెకు స్పృహలేకుండా ఎందుకు చేసేవారో! స్మశానానికివెళ్లే దారిలో ఒకసారినవ్వుతూ, ఒకసారి ఏడుస్తూ అప్పుడప్పుడు క్రిందపడిదొర్లుతూ ఉంటుంది. ఇదేనా ఆమె నవ్వు? ఇదేనా ఆమె సహగమనయాత్ర? ఆ

తర్వాత వేడిబాధ భరించలేక బయటకు వస్తుందేమోనని వచ్చినవాళ్ళతో చితిమీదనున్న యామెను బయటనుంచి పొడిచి నొక్కి ఉంచేవారు. అంతేకాక ఆమెబాధచూచి ఋత్వులు భయపడకుండా ఉండడానికిగాను చితిలో ఎంతో నెయ్యి, సాంబ్రాణివేసి పొగసుయంచేసేవారు. అంతులేని డోళ్ళు, తప్పెటలు వాయిస్తూ, శంఖాలుఊదుతూ ఆమె అరుపులు, కేకలు, ప్రార్థనలు ఎవరూ వినకుండా చేసేవారు. ఇదే సహమరణం !

అయితే ఈ విషయంలో పలువురు పలువిధాలుగా చెబుతారని నాకు తెలుసు. మొట్టమొదట ఇక్కడి ప్రజలలో తనభర్తతో సహగమనంచేసిన స్త్రీకి నరలోకంలోకూడా పతిసాన్నిధ్యం లభిస్తుందనే విశ్వాసంవల్లనే ఆ ఆచారం అనుష్ఠింపబడింది అనేవాన్ని మాటవరుసకు సరేనని ఒప్పుకుందాం. మేము చెప్పేదేమంటే, ఈ దేశంలోని అనాగరిక, విద్యాహీనులైన సామాన్యప్రజలు ఏ నమ్మకాలు పెట్టుకున్నా, అవన్నీ కూడా గౌరవనీయుల, విద్వాంసుల వద్దనుంచి అనుకరించడమే జరుగుతూంటుంది. ఆ రోజుల్లో ఈదేశమందు మహాపండితులు విద్యాలయాల్లో సాంఖ్య, వేదాంత శాస్త్రాలు చెబుతూ పూర్వజన్మ—పునర్జన్మలపై విశ్వాసం కలిగియుండేవారు. తమ కర్మల ఫలస్వరూపంగానే జీవులకు మీన, పశు, పక్షి, మానవజన్మలు లభిస్తాయని చెబుతూ దేవయాన, పితృయానములగురించి చెప్పేవారు. అలాంటప్పుడు అట్టి దేశంలో తమతమకర్మఫలితం భూమిమ్మీద ఏమైనా, సహగమనంవల్ల

భార్యాభర్తలు పరలోకంలోకూడా కలిసి ఒకచోటే ఉండ గలిగేవారని విశ్వసించేవారంటే నమ్మశక్యంగాకుండా ఉంది.

సహగమనాన్ని ఆంగ్లేయులు మన దేశంలో నిషేధించి నప్పుడు పండితులంతా విద్యాలయాల్లో, సభల్లో, సమావేశాల్లో ఎంత అలజడిచేశారని, ధనికులనుండీ రాజులనుండీ చందాలు వసూలుచేసి ఇంగ్లండువరకూ అప్పీలుచేశారని లేకీగారు వ్రాశారు. ఆ అప్పీలులో ఈ ఆచారాన్ని నిషేధించడమంటే హిందూమతాన్ని నాశనం చేయడమని, దాంతో హిందువులందరూ ధర్మచ్యుతులైపోతారని వ్రాశారట. ఇది గొప్ప స్త్రీ పూజ!

ఇంత ఆందోళనచేసినా సనాతనుల అప్పీలు త్రోసివేయబడింది. ఇక అప్పుడు బాజా-భజంత్రీలు, శంఖధ్వనులు ఆపి, కనీసం స్మశానంలో ఎలాగోఅలాగా చితిపైకి గప్‌చిప్‌గా ఎక్కించి కాల్చివేసినా పోలీసులదృష్టినుండి తప్పించుకోవడం అసంభవమని తేలిపోయింది. అందుచేత పోలీసుల కేసుల్లో చిక్కుకునేకంటే సనాతన హిందూధర్మం రెండు మూడంగుళాలు దిగిపోయినా ఫర్వాలేదని అనుకున్నారు కాబోలు!

అందుచేత మరోమార్గం వెతుక్కోవలసివచ్చింది. ప్రభుత్వం తనపనేమో చేసేసింది. మరి దానికి తిరుగులేదాయె. అయినా యిలాంటి చిక్కుసమయాల్లో ఊరుకుంటే అప్రతిష్ఠ గదా. కనుక ప్రభుత్వం తమ మతాన్ని, సాంప్రదాయాన్ని లక్ష్యపెట్టలేదని పైకిఅంటూ, ఈలోగా 'వితంతువు'లను 'దేవ

తలు'గా చెయ్యడానికి ప్రయత్నాలు ప్రారంభించారు. తమ శాస్త్రాలన్నీ దుమ్ముదులిపి బయటకులాగారు. అందులోంచి వెతికి వెతికి—ఇంతకాలం ఎక్కడ నిద్రపోతున్నాయో తెలీదు గాని—తమకు కనుకూలమైన శ్లోకాలను బయటికితీశారు. సంఘ మర్యాద, నీతి అనే అందోళన లేవదీసి ఎన్నికష్టాల నీ సజీవ వితంతువులపైన రుద్దడానికి వీలుంటుందో అన్నీ రుద్ది, వారిని 'దేవత'లనుగా చేసే ప్రయత్నాలు ప్రారంభించారు! నగలు వగైరా ధరించరాదు. రోజుకు ఒక్కసారే భోంచెయ్యాలి. ఎముకలు విరిగిపోయేటట్లు పనిచెయ్యాలి. తానులోంచి చింపిన అంచులేనిగుడ్డలే కట్టాలి. ఇవన్నీ ఎందుకంటే ఆమె 'దేవత' గదూ! తమ వితంతువులను పోలిన 'దేవతలు' మరే సమాజంలో ఉన్నారని పురుషులు గొప్పగా ప్రచారం ఆరంభించారు. అయితే ఆ "దేవత"ను ఏ వివాహమంటపందరకుగాని, శుభకార్యాలు జరిగేచోటుకుగాని పోనిచ్చేవారు కాదు. ఈ 'దేవత' ముఖం చూచి వారంతా 'దేవత'లైపోతేనో! శుభ కార్యాల్లో 'దేవత'లు పిలువబడకపోయినా, శ్రాద్ధపిండాలు వండుటకుమాత్రం ఆహ్వానించబడేవారు!

తల్లి ఆమె పడేకష్టాలు చూడలేక జబ్బుపడి చని పోయిందనుకోండి. అప్పుడు ఆమెతండ్రి ఆ యాభై ఏండ్ల వయస్సులో, తప్పనిసరియై - యిచ్ఛాపూర్వకంగా కాకపో యినా-ఇతరులను కాదనలేకనే తనకూతురుకంటె చిన్నపిల్లను వివాహమాడి ఇంటికి తీసుకువస్తాడు. దాంతో ఇంట్లోని 'వితంతువు'కు తెల్లవారకుండాలేచి, పెందరాళే వంటచేసి పది గంటలలోగానే తన సవతితల్లికి భోజనంపెట్టాలని ఆజ్ఞ; లేక

పోతే ఆ 'చిన్నపిల్ల' ఆగలేదాయె! ఈ ఇంట్లో క్రొత్తవధువును 'వితంతుకూతురు'ను ఒకేవిధంగా చూచి విలువకట్టడానికి వీలుండదని వేరే చెప్పనక్కరలేదు. తండ్రి క్రొత్తగా పెళ్ళిచేసుకుని వధువును యింటికి తెచ్చుకున్నాడు. ఆయన పురాతన సాంప్రదాయాల్లో గురువు. వారి శాస్త్రపాండిత్యము అపారము. అందులోనూ ఈమధ్యనే వితంతు వివాహాలు కూడదని ఒకపుస్తకంకూడా వ్రాశారు. ఇలాంటివే మరెన్నైనా ఆయన్నిగురించి చెప్పవచ్చు. అట్టివారు అదేయింట్లో ఉన్న తన వితంతుకూతురుకంటె చిన్నపిల్లను భార్యగా స్వీకరించి తెచ్చుకున్నారంటే ఇంట్లోమూలనుపెట్టి స్త్రీజాతిని పూజిస్తున్నామని ఎలా అనగలుగుతున్నారో తెలియడంలేదు. ఇవన్నీ చెయ్యలేనివారు, 'పూజించేవాళ్ళు అలాగే పూజించండి, మేముమాత్రం పూజించలేము' అంటారు. అంటే ఇలాంటి స్థితిలో తా నేమిచేయగలమూ అని ఆలోచించడానికికూడా వారు యిష్టపడరు. ఇలాంటి దుర్ఘటనలు జరుగుటకు ముందే దీనివిషయమై సాధారణంగా ఎవరూ ఆలోచించరు. నూటికి తొంభైతొమ్మిదిమంది మామూలు సమాజరీతినే అనుసరిస్తూంటారనడంలో సందేహంలేదు. ఒకభార్య ఉండగానే మరొక వందమంది స్త్రీలనుకూడా పురుషుడు తనయింట్లోకి తెచ్చిపెట్టుకోవచ్చునే! అలాంటప్పుడు 12 సంవత్సరాల వయస్సులో వితంతువైన బాలిక 'దేవత'గా మారిపోవలసిందేనా! ఇట్టి వ్యవస్థ ఈ దేశంలోని స్త్రీజాతిని ఎంత హైన్యస్థితికి తీసుకుపోయి వారిని అగౌరవంపాలుచేసిందో మాటల్లో చెప్పలేము.

ఆ సంగతి పోనివ్వండి. మనం సహగమనాన్ని గురించి చర్చించుకుంటూ సందర్భానుసారంగా వచ్చిన పురుషుల 'స్త్రీ పూజ'లోకి వెళ్ళిపోయాము. అయితే ఈ విషయంలో ఎవరైనా ప్రశ్నించవచ్చు. ఈ దేశంలోని 'సతు'లందరును బలవంతంగా చితిపైకి తొయ్యడమే జరుగుతోందా? ఎవ్వరూ తమంత తామే ఐచ్ఛికంగా సహగమనం చెయ్యడంలేదా? రాజపుత్రి స్త్రీల జౌహర్ వ్రతంసంగతి ప్రపంచమంతా ఎరుగునే! మొన్న నీ మధ్యనేగదా ఒక బెంగాలీ స్త్రీ తన భర్త మరణించగానే గదిలోకివెళ్ళి వొంటిమీద కిరసనాయిలు పోసుకుని నిప్పంటించుకుని చనిపోయింది! ఇలాంటి పతిభక్తి, ఇంత గౌరవనీయమైనవిషయాలు ఇతర దేశాల్లో కానవస్తాయా! అని అడుగవచ్చు. ఇలాంటివి కానరాకపోతే పోనీ, వీటివల్ల పురుషుల కీర్తి ఏమీ పెరగదు. అంతేకాక ఆ దేశాల్లో పురుషులకు స్త్రీలపట్ల అధికగౌరవమున్నట్లు నిరూపించబడడంలేదా? బలవంతంగాగాని, మాయోపాయంచేతగాని, స్పృహలేకుండా చేసిగాని స్త్రీలను బ్రతికివుండగా కాల్చి చంపడం—ఇదే చాలు—ఏ దేశానికైనా!

ఆనాడు వొంటికి నిప్పంటించుకొని మరణించిన స్త్రీని అందరూ ప్రశంసించారు. ఆమె ఉత్తమపతివ్రత అని శ్లాఘించారు. అంటే దాని అర్థం యింకా కొంతమంది ఇలా కాలి చనిపోతే వారు సంతోషిస్తారన్నమాట! దీన్నిబట్టి ఈ దేశంలోని పురుషుల మనస్సు ఎలాంటిదో స్పష్టమౌతోంది. దీనితోపాటు అలాంటి పురుషులతో ఉంటూ స్త్రీల మనస్సు కూడా ఎటు మొగ్గుతుందో తెలుసుకోగలము. స్త్రీలు తా

మెవరి ఆధీనంలో ఉంటారో వారిని సంతోషపెట్టాలని చూస్తారు. మనమే మనయింట్లో అందరూ ముక్తకంఠంతో ప్రశంసించుట విన్నప్పుడు కీర్తి ప్రశంసలు అందుకోవాలని మన మనస్సు కొంచెం ఉవ్విళ్ళూరుతుందంటే, ఆపైన మత ప్రసక్తికూడా ఉంటే ఆశ్చర్యపడవలసిన అవసరమేముంది? ఆ చనిపోయిన అభాగ్యురాలిచేతిలో 'గీత' కూడా ఉందని చెబుతారు. ఏం? 'గీత'లో ఇదే చెప్పారా? అయితే చేతిలో 'గీత' ఉంటే మరీ మంచిదని ఆమె అనుకొని ఉండవచ్చు. ఈ సమయంలో అమంగళదాయకమైన ఉదాహరణలు చూపుటకు మనసు అంగీకరించుటలేదుగాని, కిరసనాయిలు పోసుకుని నిప్పు అంటించుకుని చనిపోయినవారిలో పతివ్రతలూ కాక, తనభర్తతో సహగమనం చేసినవారూ కాక యితర కారణాలచే చనిపోయిన వారెందరో ఉన్నారు. పత్రికలలో ఇట్టివార్తలు తరచుగా చూస్తూనేఉంటాము. ఫలానా స్త్రీ అత్తగారి పోరుపడలేక, ఫలానా యువతి తాను అనుకున్నట్లు వివాహం జరుగలేదని, ఆత్మహత్య చేసుకున్నట్లు ఎన్నోవార్తలు వస్తుంటాయి. పోనీ యివన్నీ పోనీయండి. మనం సాధ్వీమణులైన పతివ్రతలనుగురించే చెప్పుకుందాము.

భర్త మరణానంతరం ఆత్మహత్యచేసుకోవాలనేభావం ఏ స్త్రీలోనైనా ఎలా కలుగుతుందో ననేది అలా ఆత్మహత్య చేసుకుంటున్నస్థితిలో స్త్రీని చూచినవారే చెప్పాలి. మేడ మూడవ అంతస్తునుంచి దూకి ఒక స్త్రీ చనిపోవడం నేను చూచాను. విషంత్రాగి చనిపోయినట్లు చాలమందినిగురించి విన్నాను. కాని ఈ విధంగా చనిపోవడమూ, చితిపై కూర్చుని

కొద్దికొద్దిగా అగ్నికి ఆహుతిఅవుతూ చనిపోవడమూ ఒకటి కాదు. మొదటిస్థితి ఆవేశంతో మరణించడం. కాని రెండవ దానిలో ఆవేశంరాకముందే అగ్నిజ్వాలలకు ఆహుతికావడం జరుగుతుంది. అలాంటప్పుడు ఆత్మవిసర్జనమాత్యతో సమాన మాతుంది. ఆ ఫిజీకాలోని కులపెద్దల భార్యలు ముందే ఉరిత్రాళ్లు సిద్ధంచేసుకుని ఉంచుకుంటారని శైలర్ వ్రాశారు. ఫిజీ ద్వీపంలో భర్త మరణాంతరం భార్యలు తమకంఠం నులిమి వేయించుకుని చనిపోవడం మహత్కార్యంగా భావిస్తారు; ఇందు ఎవరైనా అడ్డుతగిలితే వారిమీద ఆ స్త్రీలు పగబూనుతారని హెర్బర్టు స్పెన్సర్ వ్రాశారు. ఈ విషయంలో ఆయన యింకా యిలా వ్రాశారు: "ఫిజీదీవిలో కులపెద్దలభార్యలు తమభర్తల మర ణానంతరం తమగొంతులు నులిమివేయించుకుని చనిపోవడం పవిత్రకార్యంగా ఎంచుతారు. ఒకసారి ఇటువంటిస్థితిలో వున్న స్త్రీని విలియమ్సు అతి ప్రయత్నంతో తప్పించి రక్షించాడు. కాని ఆమె ఆ రాత్రికిరాత్రి పారిపోయి, నది ఈదుకొని అవతలిఒడ్డుకు వెళ్ళిపోయింది. అక్కడ తనజాతివారిమధ్యకు వెళ్ళి, తన క్షణికదౌర్బల్యంచే తనను రక్షింపపూనుకున్నవానిమాటలకు లోబడి తప్పించుకున్నందుకు విచారం వెలిబుచ్చి తన బలి క్రతువు పూర్తిచేయమనికోరింది. విల్కిన్సు అనే ఆయన ఒక స్త్రీ తనను రక్షించినవాని నెన్నో శాపనార్థాలు పెట్టి, జీవితాంతం అతన్ని ద్వేషిస్తూఉన్నదని వ్రాశారు.

వీటన్నిటివల్లా తెలియవచ్చేదేమిటి? సహగమనం గౌరవ ప్రదమైనదని. అట్లనిఅన్నది ఒక్క ఆర్యజాతియేకాక ఇంకా

యితరజాతులుకూడా ఉన్నాయి. కాబట్టి ఆర్యజాతేకాక అనేక నీచజాతులుకూడ గౌరవించబడాలి. అంతేకాక మరొకవిషయం కూడాఉంది పురుషులు తాము కావాలనుకున్నది ధర్మమంటూ ప్రచారంచేశారు. ఆ ప్రచారాన్ని స్త్రీలు నమ్మి, పురుషుల కోర్కెనే తమకోర్కెగా భావించి పొరబడ్డారు. ఆపొరబాటును ఆచరణలో పెట్టి సుఖపడుతున్నామనుకున్నారు. అయితే దాని వల్ల స్త్రీలకు గౌరవం పెరుగవచ్చుగాక. కాని, ఆ గౌరవంవల్ల పురుషుల అగౌరవందాగలేదు. ఇంతకఠినమైన ఆచారం ఎందుకు వెంటనే ప్రచారంలోకి వచ్చిందా అని ప్రశ్నించవచ్చు. దానికి సమాధానం ఉందిగా — స్త్రీ పరలోకంలో చేరి, తన పతిసేవ చేయగలుగుతుంది! అని. కాని పరలోకమంటే ఏమిటో ఎంత మంది పురుషులకు తెలుసు? ఆశ్చర్యమేమంటే ఇంత అత్యాచారం, అక్రమం, రాక్షసకృత్యాలు సహించికూడా స్త్రీలు ఎప్పుడూ పురుషులను ప్రేమిస్తూనేవచ్చారు, గౌరవిస్తూవచ్చారు, పూజిస్తూవచ్చారు, వారిని విశ్వసిస్తూవచ్చారు! తండ్రియని, సోదరుడని, భర్త అనీ తాననుకొనేవారు యదార్థంలో ఇంత నీచులనీ, మోసగాళ్ళనీ ఆమె కలలోకూడా తలచజాలదు! ఇదే ఆమె విలువేమో ననిపిస్తోంది.

బిల్వమంగళ ప్రసిద్ధిచెందిన నాటకం. చాలాకాలం నుంచీ రంగస్థలంపై ఆ నాటకం బహిరంగంగా అభినయించబడుతోంది. ఇందులో ధర్మానికిచెందిన విషయాలున్నాయని భారతీయులేమీ చింతించరు. వేలకొద్దీ ప్రేక్షకుల ఎదుటనుంచి వశీకుడు దీర్ఘోపన్యాసమిచ్చి తనభార్యను కామాం

ధుడైన అతిథివద్దకు పంపుతాడు. ప్రేక్షకులు డబ్బిచ్చి ఈ నాటకాన్ని చూచి, బాగా ప్రశంసిస్తారు వణిక్కుని దీర్ఘోపన్యాసంయొక్క సారాంశం ఏమిటంటే, తాను తన యింటికి వచ్చిన అతిథి కోరినది యిస్తానని ప్రతిజ్ఞ చేశాడట; అందుచేత తన ప్రతిజ్ఞాభంగమైతే అసత్యాచరణకు యమదూతలువచ్చి తన్ను దండిస్తారేమోనని! అంటే అతనిమనస్సులో, తన కాలిలో ముల్లుకూడా గుచ్చుకోరాదు. తన భార్య ఏమైనాసరే అనే భావం ఉన్నదనేగదా అర్థం. అంతేకాక తన సర్వస్వం డబ్బు-దస్కం, ఏనుగులు-గుర్రాలు, ఆవులు గేదెలు—ఉన్నదంతా యిచ్చి అతిథిని సత్కరించాలనికూడా శాస్త్రిల్లో చెప్పారు. అతిథికి యివన్నీ అవసరంలేనప్పుడు యెలా మరి ? అందుచేత 'నువ్వే అతనివద్దకు వెళ్ళు. అతను నానుండి నిన్నే కోరాడు. మరినీవు నా స్థిరచరాస్తిలోని దానవుగదా' అంటాడు. భర్తయెడల పతివ్రతా స్త్రీకి ఉండవలసిన గౌరవం అదే! ముక్కూమొహం తెలియని ఒక పాపాత్ముడగు అతిథిసేవలో స్త్రీ విలువ యిదే!

బిల్వమంగళుని భక్తులు ఇందుకు పూర్వపక్షంగా "హిందువులు అతిథిసేవలో ప్రాణాలుసహితం లెక్కచేయరు. కర్ణుడు తన పుత్రునికూడా బలియిచ్చాడు" అంటారు. అవన్నీ మా కెరుకే. దానకర్ణుడూ గొప్పపని చేశాడు, వణిక్కుడూ గొప్పపని చేశాడు. కాని విషయం అదికాదు. ప్రాణాలు తమవి కావుగా. తమ కిష్టమైతే వారు తమ ప్రాణాలను త్యాగం చేసుకోవచ్చు. అంతేగాని, స్త్రీ మీ సంపత్తి అనే భావంతో, స్త్రీకి మీరు భర్తగదా అని మీ యిష్టంవచ్చినట్లు

అవసరమైనప్పుడల్లా ఆమెను బ్రతికి ఉండనివ్వడం లేక ఆమెను చంపివేయడం—యిలా ఆమె నారీధర్మంపై అత్యాచారాలు చేయడానికి మీకు హక్కు లేదు. ఈ విశృంఖలత్వం మిమ్మల్నీ మీ పురుష జాతినీ కూడా హీనపరచింది; పతివ్రతయైన మీ భార్యను, ఆమెతోపాటు స్త్రీజాతిని అవమానపరచింది.

అతిథిసేవ గొప్ప ధర్మమే కావచ్చు; కాని అందుకని మీరు దొంగతనం, దోపిడీ చేయలేరుగదా? అలాగే యిదీ చెయ్యరాదు. యూదులు పశువుల్లాగా ఉండేటప్పుడు తమ ఆస్తి పంపిణీలో స్త్రీలనుకూడా భాగించుకునేవారట. ఇప్పటికీ యిల్లూ-వాకిలి, పొలమూ-పుట్రా, గొడ్లూ-గోదలతో స్త్రీలను కూడ అన్నదమ్ములు పంచుకునే అసభ్యజాతులింకా ఉన్నాయి. స్త్రీజాతిని గురించి వణికుని భావంకూడా బహుశా యిలాంటిదే కావచ్చు. ఒకవేళ అతిథిసత్కారం మహా గొప్ప ధర్మమై అందుకోరకు పతివ్రతా స్త్రీల సర్వస్వం నాశనంచేయటం ధర్మ పాలనగా ఎంచబడితే, నేడుకూడా ఆ ధర్మాన్ని పాటించేవారిని నీచులనడం సబబుకాదు.

అమెరికాలోని ఛినుక్ అనే అసభ్యజాతిని గురించి వ్రాస్తూ, 'వారు తమ అతిథిపక్కలోకి తమ యింట్లోని శ్రేష్ఠమైన కన్యను—అలాంటికన్య లేకపోతే తమభార్యను పంపుటే ఉత్తమ ధర్మపాలన అనుకుంటారు" అని కెప్టెన్ లూయిసన్ వ్రాశారు. ఆసియాలోని చుక్‌చీ జాతినిగూర్చి అరమైన్ ఇలా వ్రాశారు: చుక్‌చీలవద్దకు ఎవరైనా యాత్రికులు వెళితే వారి గౌరవార్థం తమ భార్యలనేకాక, తమ కూతుళ్ళనుకూడా సమర్పిస్తారు.

కెప్టెన్ లాయన్, సర్ జాన్ లమక్ లు ఎస్కిమోజాతి, కమ్‌స్కాట్‌కా నివాసులు. కాల్‌ముఖ్ ప్రజలనుగురించి కూడా యిలాంటి అతిథిసత్కార చరిత్రనే వ్రాశారు. హెర్బర్ట్ స్పెన్సర్ అనే ఆయన తన Descriptive Sociology వర్ణనాత్మక సాంఘిక శాస్త్రము అనే గ్రంథంలో ప్లస్, పైలస్ దొరల భ్రమణగాథలనుండి ఇలాంటి వివరాలు ఎన్నో ఉదహరించారు. యీ ప్రజలకీ మన పరిశుద్ధధర్మాచరణగల వణికునకు తేడా ఏమిటి? ఆ దేశాల పురుషులు తమ కర్తవ్యం అనుకున్నదాన్ని ఆచరించారు. వణికుడూ అంతే. అతిథిని సంతోషపెట్టాలనే కోరిక- యిద్దరిలోనూ సమానంగానే ఉంది. యిద్దరూకూడా అతిథి సంతృప్తిచెందకపోతే తమకు పాపాలు చుట్టుకుని, కష్టాలు కలుగుతాయని నమ్మారు, దీన్ని ఎన్ని విధాల ఎలాత్రిప్పి చెప్పినా 'మేము' అనే అహంతప్ప మరేమీ కానరాదు. అయితే ఆ 'మేము'లో స్త్రీ యెడల తమపూజ్యభావం, గౌరవం ఎక్కడ మునిగిపోయాయో తెలీదు.

భగవాన్ శంకరాచార్యులు స్పష్టంగా స్త్రీ నరకానికి ద్వారం అని చెప్పారు. బైబిలులో స్త్రీని Root of all evil అంటే అన్ని అనర్థాలకు మూలం స్త్రీయేనని వ్రాశారు. "నువ్వు సైతానుకు రహదారివి, దైవనియమాలను ముందుగా పరిత్యజించేదానివి" అని యూరపులోని ప్రసిద్ధ లాటిన్ ధర్మ ప్రచారకుడు టార్టు లియన్ స్త్రీని గురించివ్రాశాడు. "స్త్రీ తల్లిరూపంలో ఉన్నా, సోదరిరూపంలో ఉన్నా, మనం ఎల్లప్పుడూ ప్రతీ స్త్రీలోనూ సైతాను నివసిస్తూఉంటుందని

గ్రహించి జాగ్రత్తగా ఉండాలి" అని సెంటు పదవిపొందిన ఆగస్టిన్ తనశిష్యులకు బోధించాడు.

సెంట్ ఎంబ్రోజ్—ఈయనకూడా 'సెంటే'—ఇలా చెప్పాడు: దైవం స్త్రీని తయారు చేయుటకు పురుషుని శరీరం లోని ప్రక్కఎముకనే తీశాడుగాని, అతని ఆత్మనుండి ఏభాగమూ తీయలేదని గుర్తుంచుకోండి.

క్రీ. శ. 578లో జరిగిన క్రైస్తవమత సంఘ సమావేశంలో స్త్రీలో ఆత్మఉండదని నిర్ణయించబడింది. ఏధర్మం కోసం స్త్రీజాతి జీవిస్తోందో, మరణించుతుందో, ఏ ధర్మ గ్రంథాలలోని ప్రతి అక్షరంపట్ల స్త్రీలకు అచలభక్తి కలదో అట్టి ధర్మగ్రంథాలు రచించేటప్పుడు, స్త్రీజాతి యెడల పురుషులుచూపిన ఆదరణ ఇదీ! మధ్యమయుగంలోని ప్రసిద్ధసెంటు బెర్నార్డ్ తనతల్లికి ఉత్తరంలో ఇలా వ్రాశాడు; నీకు నాకు సంబంధం ఏమిటి? నీనుండి నాకు పాపాలుతప్ప మరేమి లభించాయి? నన్ని దుఃఖమయ ప్రపంచంలోకి నువ్వే తెచ్చావు. అదేచాలదూ? మీరంతా పాపాత్ములు; నన్నూ ఈ పాప కూపంలోకి తెచ్చావు.

ఇవాళ యూరపియన్లు తాము స్త్రీలకిస్తున్న Dignity మర్యాద మరెవ్వరూ యివ్వడంలేదని విర్రవీగుతున్నారు కాని, 14, 15 శతాబ్దాలలో ఐరోపావాసులు స్త్రీల యెడల ప్రదర్శించిన అసహిష్ణుత, స్త్రీలను వారు పెట్టినన్ని బాధలు మరేజాతీకూడా పెట్టివుండదు. వీరి Sacredotal celibacy చరిత్ర, చర్చిచరిత్ర మొదలైనవాటి ప్రతిపుట

లోను అనేకమైనట్టి పుణ్యగాథలు చూస్తే, నేను పైనచెప్ప మాటలు అవహాస్యం పాలౌతాయని వేరే చెప్పనక్కరలేదు.

ఆదిమజనని అవ్వ Eve పాపాలనే మూలాధారం చేసుకున్న మతం ప్రపంచంలోని సమస్తపాపాలకు మూలం స్త్రీయేనని పాతాళంలోకి త్రొక్కిపట్టిన మతం,— ఆ మతమే ప్రపంచంలోని అన్నిమతాలలోను గొప్పదని భావించేవారు స్త్రీజాతిని గౌరవించగల రనుకోవడం అసంభవం. తమ స్వార్థ పరిమాణంలోనే వారి గౌరవమూ ఉంటుంది. అంతకుమించిన గౌరవం అనండి లేదా స్త్రీల న్యాయపూర్వకమైన అధికారా లనండి, వెయ్యిసంవత్సరాలముందూ ఇవ్వలేదు; ఇక వెయ్యి సంవత్సరాల తర్వాతా యివ్వబోరు. మిల్ దొరగారు తన Subjection of Women (స్త్రీల పరాధీనత) అనే పుస్తకంలో ఇదొక Isolated fact (వేరుబడ్డ సత్యము) అనివ్యర్థంగా తమ దుఃఖాన్ని ప్రకటించారు.

మహానిర్వాణ తంత్రంలోని "కన్యాప్యేవం పాలనీయా శిక్షణీయాతి యత్నతః" అన్న వాక్యం మినహాయించితే మరే శాస్త్రంలోనూ కూడా స్త్రీ విద్య అనుమతింపబడలేదని తెలుస్తుంది. కీ. శే. అక్షయకుమార దత్త మహాశయులు తమ 'భారతవర్షీయ ఉపాసక సంప్రదాయ్' అనే గ్రంథం ఉపక్రమణికలో దీనికి వ్యతిరేకంగా పెద్దవాదన లేవదీసి, ప్రాచీనకాలంలో స్త్రీలు వేద రచనలో కూడా పాల్గొన్నారని వ్రాశారు 'త్రయీ న శ్రుతిగోచరా' అనే శ్లోకం శాస్త్రాలలో ఉన్నప్పుడు ఈ వాదన లకు విలువేమీ ఉండదు. యూరపులోని ఒక పురాతన మత ప్రవక్త యిలా వ్రాశారు: "స్త్రీలు వేదాంతము చదువ

వలెనా ?—విల్లేము వైవాహిక నియమాలను పాటించడమే స్త్రీల వేదాంతం." "విజ్ఞానతృష్ణ కలిగియుండడంకంటె స్త్రీకి అహితకరమైనది మరొకటి ఉండదు" అని మార్టిన్ లూథర్ ఎప్పుడూ అంటూఉండేవాడు. చైనా దేశంలో ఒకసూక్తి బాగా ప్రచారంలోఉంది. దాని అర్థం: జ్ఞానం పురుషులకు వికసింపజేస్తే, అజ్ఞానం స్త్రీల సౌందర్యాన్ని పెంచుతుంది—ఇక అలాంటప్పుడు పురుషులు తమకు కేదో మేలు చేకూరుస్తారని స్త్రీ లెలా ఆశించగలరు ? ఊర్వసి వేదాల నెప్పుడు రచించింది ? భర్త ప్రవాసంలోఉండగా దశపౌర్ణమివ్రతాలలో హోమంచేయుటకు స్త్రీ కెలా అధికారం ఇవ్వబడింది ? బృహదారణ్యకోపనిషత్తులో యాజ్ఞవల్క్య గార్గిల సంవాదన రచనకు హేతువేమిటి ? మొదలైనవన్నీ అరణ్యరోదనాలే.

నేటికి ఆరువేలసంవత్సరాలపూర్వం ఈజిప్టు మున్నగు ప్రాచీన నాగరికతలకాలంలో స్త్రీలకుండిన అధికారాలను గురించి మాస్పెరో ఇలాంటి వెన్నో చెప్పారు:—"భార్య ఎదుట భర్త స్థితి గౌరవనీయ అతిథివంటిది. స్త్రీకి తన అన్నదమ్ములతో సమానంగా పితృసంపత్తిలో భాగంవుండేది; ఆమె యింటికి యజమానురాలు; చట్టందృష్టిలో ఆమెకు పురుషునితో సమానాధికారాలు ఉండేవి; పురుషునితో సమానంగానే గౌరవింపబడుతూండేది." రోమ్‌పై ఈ సభ్యతా ప్రభావమే ప్రసరించింది. అందుచేతనే అప్పట్లో రోమన్ స్త్రీలుకూడా ఉచ్ఛస్థితిలో ఉండేవారు. మేన్ దొరగారు తన Ancient Law (ప్రాచీన శాసనాలు) అనే గ్రంథంలో పరివర్తనచెందిన నవ

నాగరిక శాసనాలలో ఈ దుష్టచట్టం Pagan Law ఎక్కడ ఎలా వెనకబడిందో తర్కించారు.

విద్యావంతులైన స్త్రీలందరూ సర్ హెన్రీయొక్క ఈ అధ్యాయాన్ని చదువగోరుతున్నాను.

యూరపు శాసననిర్మాణంలో రోమ్ ప్రభావం ఎక్కువగా ఉన్నా, స్త్రీలకు సంబంధించినంతవరకు యూదుల కఠిన నియమవిధానాల పలుకుబడే అధికంగా ఉన్నది. ఎందువల్ల నంటే ఆ కఠిననియమాలు పురుషులకు బాగా నచ్చాయి. అవి మొదట్లో ధార్మికసాన్నిహిత్యంవల్ల స్వాభావికంగా కనిపిస్తాయి. కాని, కొంచెం జాగ్రత్తగా పరిశీలిస్తే, అవి స్వాభావికంగావున్నా, ధార్మికసాన్నిహిత్యంవల్లగాక, అవి పురుషులకు అనుకూలంగామాత్రమే ఉన్నాయి. అయితే వాటిలో ధార్మిక ఒత్తిడీ ఉంది.

క్రీస్తు అనేక విషయాలు చెప్పారు. కాని స్త్రీలపై జరిగే అత్యాచారాలనుగురించిమాత్రం స్పష్టంగా ఎక్కడా చెప్పలేదు. కాని ప్రపంచవిఖ్యాత సెంట్‌పాల్ మాత్రం 'మతాన్నిగురించి పురుషులవలె స్త్రీ లేమీ ప్రశ్నించరాదు. వారు ఎల్లప్పుడూ తమ భర్తల అధీనంలో ఉండాలి' అని చెప్పారు. ఆయన యింకా యిలాచెప్పారు: "ఈశ్వరుడు పురుషులకొరకు స్త్రీలను సృష్టించిన కారణంతోనే స్త్రీలకోసం పురుషులను సృష్టించలేదు. స్త్రీ పురుషునికి విద్య నేర్పరాదు. స్త్రీయే ప్రపంచంలో పాపాన్ని ప్రవేశపెట్టింది. అందువల్ల స్త్రీలు అనంతనరకంలో మునిగిపోతారు. వారి సద్గతికి మార్గమేలేదు. అయితే వారు తమగర్భంద్వారా సంతానం

కలిగివుంటేమాత్రం వారికి సద్గతిలభించవచ్చు" ఈశ్వర సాక్షాత్కారంపొందిన పాల్ మహాశయుని ఈ వాదన ఎంతచిక్కగా ఉంది! స్త్రీలపట్ల ఆయనకి ఎంత చిన్నచూపు! మీరు యూదులకు సంబంధించిన **ఏ** మతగ్రంథమైనా తీసుకోండి : అందులో ఈ మార్గమే సూచింపబడి ఉంటుంది. మనశాస్త్రాలలో కూడా సంతానంవల్లనే స్త్రీలు 'పెద్దముత్తైదువ' అనబడుతున్నారు. అంతేకాక పుత్రునికోరకే పత్నీవరణ వ్యవస్థ ఏర్పరచబడింది. ప్రపంచంలోని ఇంకా ఏ యితర దేశపు మతగ్రంథాలు తీసుకు చూసినా ఇలాంటిదే ఏదో చెప్పబడిఉంటుంది.

స్త్రీలకు గౌరవం స్వయంగా తనంతట్లే కలుగదు. తను సంతానంపైనో, పుత్రప్రసవంపైనో ఆధారపడివుంటుంది. పురుషునిదృష్టిలో స్త్రీ జీవితోద్దేశ్యం ఇది ఒక్కటే అయితే మాత్రం అది ఏవిధంగానూ గౌరవవిషయం కాజాలదు. కాని వాస్తవంలో అలాగే ఉంది. ప్రపంచం స్త్రీలనుండి సంతాన ప్రసవానికి మించి మరేమీ ఆశించడంలేదు. అంతేకాక స్త్రీల కిచ్చే కొద్దిపాటి గౌరవమైనా అది వారు పిల్లల్నికంటారు కనుకనే. మనశాస్త్రాల్లో 'క్షేత్రజ' (అశాస్త్రీయ) సంతానాన్ని పొందేరీతికూడా చెప్పబడివుంది. కుంతి పంచపాండవులను, అంబాలిక పాండురాజు, ధృతరాష్ట్రులను కనవలసి వచ్చింది. కాని పతివ్రతాస్త్రీలకు ఇదేమీ గౌరవప్రదమైన విషయంకాదు. ప్రాచీన యూదుసమాజంలో సంతానంలేని వితంతువైన వదినె సంతానవతి అయ్యేందుకు మరదికి ఉప-పత్ని గా ఉండవలసివచ్చేది. 'డూటర్నమీ' అనే మతగ్రంథంలోని

25వ అధ్యాయంలో స్త్రీలకు శాస్త్రీయవిధానాలగురించి చెప్ప బడిన రీతులు చదివితే అసహ్యామనిపిస్తుంది. అదేవిధంగా ఆఫ్రికాలో కూడా స్త్రీలు తప్పనిసరిఅయి ఎక్కో అసాధ్యపు పనులు చేయవలసివచ్చేవి. "ఇతర అనేక అనాగరికజాతుల వలెనే దహోమియన్‌లుకూడ కుటుంబంలో ఎక్కువమంది సంతానం ఉండడం దైవానుగ్రహం అనుకునేవారు" అని హెర్స్కొవిట్స్ వ్రాశాడు, ఆయన తూర్పు ఆఫ్రికాను గురించి ఇలా వ్రాశారు. "అవివాహితకన్యకూడా పిల్లలతల్లి కావడం కళంకంగా ఉండేదికాదు. ఏ స్త్రీకైనా ఎక్కువ మంది పిల్లలుంటే ఆమె తప్పులన్నీ కాలదోషంపట్టిపోయేవి" ఓటియాక్సు జాతినిగురించి—వారిలో కన్య సంతానవతికావడం గౌరవప్రదంగా ఎంచబడి, అట్టి కన్యకు అధికధనం లభించేదని వ్రాశారు. బైబిలులోని Old Testament పూర్వభాగ మందుకూడా స్త్రీకి సంతానంలేకపోవడం మహా పాపమని చెప్పబడింది.

స్త్రీవిలువ ఎలా నిశ్చయింపబడుతుందోనని తెల్పుటకు యింకా ఇట్టి ఉదాహరణలతో ఈ పుస్తకాన్ని నింపదలచుకో లేను. అవసరం వచ్చినప్పుడు యింతకంటె యింకా వేయివి ధాలుగాకూడా పురుషుని ఉపయోగార్థం కొరకే స్త్రీకి ఈమర్యాదా! ఈ గౌరవమూ అని నిరూపించవచ్చును. కాని ఇక్కడ ఇప్పు డలాచేయవలసిన అవసరంలేదు, అయినప్పటికీ తన స్వార్థం కొరకే పురుషుడు చిరకాలంగా స్త్రీని కష్టతో యిలా అవ మానపరుస్తూ వస్తున్నాడనీ, ఇందుకు కారణం ఈ విషయాన్ని పురుషులు గ్రహించినా, స్త్రీలు గ్రహించడంలేదనీ, వార

సులు గ్రహించదలచినట్లుగా కూడా తోచుచున్నది. కుటుంబ సామాన్య సుఖ-శాంతిలో జీవిస్తూ భర్తముఖం చూచి, తన భర్తే అంతఃకరణంలో తనశుభం కోరడంలేదని ఎలా యోచించగలుగుతుంది? తన తండ్రివద్ద నిలబడి ఈ తండ్రే తన శ్రేయోభిలాషి కాడని ఎలా ఊహించగలుగుతుంది? వాస్తవంలో ఒక్కొక్క విషయాన్నే విడివిడిగా చూస్తే ఈ సత్యం గుర్తించడం అసాధ్యమే. కాని సమగ్రభావంతో స్త్రీజాతి యొక్క సుఖదుఃఖాలు, శుభాశుభాలమూలంలోకి చూస్తే మాత్రం తండ్రి, సోదరుడు, భర్త అందరి మోసాలు క్షణంలో సూర్యరశ్మివలె ముందుకొచ్చి కన్పడగలవు.

ఈ విషయాన్ని మరింత స్పష్టంచేస్తాను. దేశంలో ఏదైనా క్రొత్తనియమం ప్రవేశపెట్టబడేటప్పుడు అది ఒక్క నాడే అకస్మాత్తుగా కాక, నెమ్మది నెమ్మదిగా అమల్లోనికి వస్తుంది. దాన్ని ప్రవేశపెట్టేవారు ఎక్కువగా పురుషాధికారానికే సహాయంచేస్తారు. ఆ సమయంలో వారు తండ్రిగా గాని, సోదరుడుగాగాని, భర్తగాగాని కాక, కేవలం పురుషులుగా మాత్రమే వ్యవహరించుతారు. వారు ఎవరికి సంబంధించిన నియమావళి తయారుచేస్తారో వారు ఆత్మీయులు కాక కేవలం స్త్రీలుగామాత్రమే కనబడతారు. పురుషుడప్పుడు తండ్రిగా కూతురుబాధలను అర్థంచేసుకోడు. పురుషుడుగా పురుషులస్వార్థాన్నే దృష్టిలో ఉంచుకుంటాడు; స్త్రీలనుండి ఎలా ఎంత ఎక్కువ వసూలుచేసుకోగలమా అనే ఉపాయాలే ఆలోచిస్తాడు. ఆ తర్వాత మనువు, పరాశరుడు వస్తారు;

మూసా, పాల్ వస్తారు. శ్లోకంమీద శ్లోకం రచిస్తూ శాస్త్రాలు నిర్మిస్తారు. ఆ సమయంలో స్వార్థం ధర్మమై తన కబంధహస్తాలతో సంఘ కట్టుబాట్లను ఏర్పరచే అధికారాన్ని పొందుతుంది. దేశంలోని పురుషసంఘం అంతా వ్యాసమహర్షులై, శాస్త్రకారులు ఆ సంఘం ఆమోదించిన నియమాలను వ్రాసే చిత్రగుప్తులు అవుతారు. అన్ని దేశాల శాస్త్రాలూ చాలవరకు యిలా రచింపబడినవే.

తర్వాత శాస్త్రాలను అంగీకరించి, వాటి కనుగుణ్యంగా నడచుకొనే కాలంవచ్చింది. మతపీఠాలపై పురుషులు తిష్ట వేసుకు కూర్చోవటానికి ఎంతో కాలంపట్టదు. మరి ఆ ధర్మపరిపాలనాదృష్టిలో వ్యక్తిగత సుఖ-దుఃఖాలు ప్రేమ-మమతలు మంచి-చెడ్డలు అన్నీకూడా వరదప్రవాహంలో పూలు, గడ్డిపోచలు కొట్టుకుపోయినట్లు కొట్టుకుపోతాయి. మనదేశంలోని సహగమన ఆచారంలోనూ యితర దేశాలలోని అమానుషిక రీతుల్లోనూ ఈ విషయమే కనపడుతుంది. యూదులు తమ దేవతలకు తమ కొడుకులను, కూతుళ్ళను బలి యివ్వటానికి వెనుకాడేవారుకాదు. వారి మతగ్రంధాల్లోని ప్రతి పుటలోనూ సంతానబలిని గురించి వ్రాయబడిన గాథలు లెక్కలేదు. వారి 'మేలేక్' దేవత యిందుకే ప్రసిద్ధిచెందింది. మెక్సికోలోని తల్లి తండ్రులు తమ దేవతకు తమ కూతుళ్ళలో శ్రేష్ఠమైనదానిని బలిఇచ్చి పుణ్యం ఆర్జించుకొనుటకు ఏమాత్రం సంశయించేవారు కాదు. చాలా దేశాల్లో ధర్మం పేరుతో దానకర్ణునివలె తమ పుత్రులను హత్యచేసిన రాజులెందరో కన

బడతారు. మేవాడ్ రాజు తనపుత్రిని బలియిస్తే, కార్ ఖేట్ రాజు తన కూతురును వధించాడు. ప్రాచీనకాలంలో మతం పేరుతో సంతానహత్య జరగని దేశమంటూ లేనేలేదు. అయితే ఆకాలంలో తల్లిదండ్రులు తమ సంతానాన్ని ప్రేమించేవారుకాదని అనగలమూ? తప్పక ప్రేమించేవారు. కాని మమత, వాత్సల్యం ఉండడానికి వీలుండేదికాదన్న మాట. ఆచారము ధర్మంగా మారినప్పుడు, దానివల్ల దేవతలు సంతృప్తి చెందేటప్పుడు, పరలోకానికి మార్గం ఏర్పడేటప్పుడు — ఎలాంటి అమానుషిక కార్యమైనా సాధింపబడితీరుతుందిగదా. అంతేగాక ఆ పని ఎంతకఠోరంగా, ఎంతభీభత్సంగా ఉంటే పుణ్యపరిమాణమూ అంత అధికంగానేఉంటుంది. అలాంటప్పుడు తల్లిదండ్రులు సంతానంకోరకని విముఖులు కాజాలరు.

అప్పుడప్పుడు ప్రేమ - వాత్సల్యాలు కొంతమందిని బాధించవచ్చు. అయినా కఠోరక్రతువునుండి తప్పించుకునే ఉపాయం ఉండదు. తన స్వార్థంకోరకని పురుషులు సామాన్యభావంతో ధర్మంగా స్థాపించినపుడు తండ్రిగా దానిని అతిక్రమించలేడుగదా.

ఏభైయేళ్ళ ముసలివానికిచ్చి తన [illegible] బాలిక వివాహం చెయ్యవలసి వచ్చినప్పుడు ఆ తండ్రిహృదయంలో తాత్కాలికంగా బాధ కలుగవచ్చు; కాని ఎంతవెతికినా మరో ఉపాయం దొరకదు. ఒకప్రక్క కులగౌరవాన్ని, మరొకప్రక్క ధర్మాన్ని రక్షించడం అతని విధి. పురుషునిగా, సంఘంలోని ఒక అంగంగా ఆ ఆచారాన్ని వ్యాపింప

జేసినది తనేగదా. ఆ ఆచారమే అతని ఒకచేత్తో అతని కన్నీటిని తుడిపిస్తూ, రెండోచేత్తో కఠోరబలిదానం చేయించడానికి అతన్ని బాధ్యుణ్ణిచేస్తోంది. ఆ నిర్దాక్షిణ్యామైన కార్యమునుండి విముఖునిచేయగలశక్తి వాత్సల్యంలో లేదు. అందుచేతనే ప్రేమ, జాలి, మోహం ఉన్నప్పటికీ జనం అశుభకార్యాలు చేయగలగటము ఆత్మీయులైనాకూడా పరమశత్రువులవలె దుఃఖం కలుగ జేయగల్గటమూను.

కాని మనం ఆ స్వార్థాన్ని గురించి ఏమీ చెప్పలేము, ఎంచేతనంటే ధర్మంపేరనే తన్ను తాను శాంతపరచుకుంటాడు. కాని ఆచారాల లోతుపాతుల్లోకి చూడగలిగితే మాత్రం ఆ మూలంలో స్వార్థంతప్ప మరేమీ కనపడదు. కాని దాన్ని చూడగల్గటం చాలాకష్టం. తండ్రివైపునుంచీ కష్టమే; కన్యవైపు నుండీ కష్టమే. ప్రతిష్ఠాపిత నియమానుష్ఠానంలో మనిషి ఏకాంతంగా నిమగ్నుడైనపుడు అతని నేత్రదృష్టికూడా క్షీణమై పోతుంది. అలాంటప్పుడు ఏది ధర్మమో, ఏది అధర్మమోకూడా చూడలేడు. వైదిక యజ్ఞకర్మలలో లెక్కలేని జీవహత్యలలో అన్యాయ మెక్కడున్నదో బుద్ధదేవుడు మనుష్యులను ఆ హత్యకుదూరంగా లాక్కుపోయిన తర్వాతనే చూడగలిగారు. సహగమనం నేడు ఆగిపోయింది. కాబట్టి యిప్పుడా పేరు చెవి తేనే మనఒడలు జలదరిస్తుంది. గంగాసాగరంలో సంతానాన్ని పారవేయుటలోగల పాపాన్ని నేడు మనం చూడగలుగుతున్నప్పుడు ఆంగ్లేయుల శాసనాన్ని హృదయపూర్వకంగా శ్లాఘిస్తున్నాము. కాని ఆనాడు ఆ చట్టానికి వ్యతిరేకంగా ఎంతదుమారం లేవదీయలేదు ? అప్పీలు చేయుటకు కృషిచేసేవారిని ఆ పమ్మిత్తు

లుగా పొగడి, కీ. శే. రాజా రామమోహనరాయ్‌ని మతద్వేషి
యైన రాక్షసుడని ఎన్ని తిట్టామో !

నేడు మనకు ఆ భ్రమ తొలగినట్లు కన్పడినా, ఇంకా
మనలో చైతన్యం కలుగలేదు. నేడుకూడా సాంఘిక సమస్య
లను పరిష్కరించుకొనుటకు పాతపండితులవద్దకే పరుగెడుతు
న్నాము. వారే శాస్త్రములు తెలిసినవారిని వారని ఏది మంచి,
ఏది చెడ్డ అని అడుగుతున్నాము. పండితులకు శాస్త్రాలలోని
శ్లోకాలుతప్ప మరేమీ తెలియదని యింకా మనం గుర్తించడం
లేదు. విద్యయొక్క ఆదర్శం హృదయౌన్నత్యమేనని మనం
ఆలోచించినట్లయితే ఈ పండితుల్లో చాలమంది చదువు వ్యర్థ
మని బోధపడుతుంది. పిల్ల పెళ్ళికి యుక్తవయస్సు ఏది అని
మనం వారిని ప్రశ్నిస్తే, శాస్త్రములు తిరగేస్తారు. అలాగే
వితంతు వివాహం ఉచితమా అనుచితమా అని అడిగినా తమ
గ్రంథాలు తిరగవేస్తారు. ఆయా విషయాలనుగురించి శాస్త్రా
ల్లోని శ్లోకాల్లో ఏమున్నదోనని చూస్తారు. శాస్త్రాలు వారి
దృష్టిని క్షీణింపజేశాయి. శాస్త్రాలకు మించి వారేమీ చూడరు.
శాస్త్రాలనుదాటి ఒక్క అడుగు ముందుకు పెట్టలేరు. వారు
కంఠస్థం చేయడమే జ్ఞానం అనుకున్నారు.

వారిజ్ఞానం అరసున్న, విసర్గలనుకూడా ఎలా అతిక్ర
మించలేదో కొన్ని ఉదాహరణలిస్తున్నాను. కీ. శే. మహా
మహోపాధ్యాయ చంద్రకాంత తర్కాలంకార మహాశయులు
"శ్రీ గోపాలమల్లిక్ ఫిలోషిప్"లో ఇచ్చిన ఉపన్యాసంలో

నామకరణ-ప్రణాళికనుగురించి యిలా చెప్పారు—"కొంత మంది మేరు-తంత్రంలో లండన్ నగరాన్ని గురించి ఉల్లేఖింప బడి ఉందనీ, అందుచేత అది ఆధునికమనీ అంటారు. కాని పురాణాలు మొదలైనవాటిలో అనేక భవిష్యత్సూక్తులు వున్నా యని వారు గుర్తించాలి. మేరుతంత్రంలోకూడా భవిష్య త్సూక్తులున్నచోట లండనునుగురించి చెప్పబడింది. అందు వల్లనే మేరుతంత్రం ఆధునికము కాజాలదు" మేరుతంత్రములో నుండి లండనును గురించినది భవిష్యదూహాయని చూపుటకు వారు కొన్ని శ్లోకములు ఉదహరించారు.

> పూర్వామ్నాయే నవశతం షడశీతిః ప్రకీర్తితా
> ఫిరంగభాషయా మంత్రా యేషాం సంసాధనాత్ కలౌ
> అధిపా మండలానాం చ సంగ్రామేష్వపరాజితాః
> ఇంగ్రేజా నవషట్ పంచ లణ్డ్రజాశ్చాపి భావినః".

అటు కీ. శే. అక్షయదత్త మహాశయులుకూడ శాస్త్ర కారుల మోసాన్ని నిరూపించుటకు అదే శ్లోకాన్ని తమ "భారతవర్షీయ ఉపాసక సంప్రదాయ్" అనే గ్రంథంలో ఉప క్రమణికయందు వుదహరించారు. వీరిద్దరి పాండిత్యమూ చాలా గొప్పదే. అయితే వీరిలో ఒక మహాశయులు యే శ్లోకంయొక్క అస్తిత్వంచే ప్రశంసానుభూతిపొందారో, మరొ కరు అదే శ్లోకమును ఘృణాపూర్వకంగా విసర్జిస్తున్నారు! ఇందులో ఎవరి భావాలు న్యాయసంగతములో గుర్తించటానికి ఎంతోకాలం పట్టనక్లేదు కీ. శే. మహామహోపాధ్యాయ మహా శయులవారికి సరిపోల్చు దేశవిఖ్యాత పండితచూడామణి మహా

శయుల వాదన వింటే, వీరికి సంస్కృతశ్లోకాలపై గల మూఢ విశ్వాసమును చూచి, వీరిపై ఏమాత్రం ఆశ, భరోసా లేకుండా పోతోంది. అంతేకాక ఆ పండితులు మేరుతంత్ర ప్రామాణ్యాన్ని గురించి సందేహించడానికి పురోకారణంకూడా పెలిబుచ్చారు. పారసీభాషలోనూ, ఫిరంగిభాషలోనూ వున్న వనుకుంటున్న మంత్రాలు అసలా భాషల్లో లేనేలేవని ఆ భాషలు తెలిసిన వారు ఎరుగుదురట!

అవాంఛనీయంగానే ఇక్కడ వారికి కొంత జంకుకలిగింది. కాని, జంకవలసిన దేమీలేదు. పురాణాలు మొదలైన వాటిలో యోగబలంతో చెయ్యిచూచి భవిష్యత్తు చెప్పినట్లు వ్యాసుడు, మేరుతంత్ర రచయిత చెయ్యిచూచి లండన్ నగరాన్ని గూర్చి, కలికాలంలో మంత్రసిద్ధులైన ఆంగ్లేయుల పరాక్రమాన్నిగురించీ అట్లే ఉల్లేఖించి ఉంటాడంటే ఆశ్చర్యమేమున్నది? అందుచేతనే వారు ముందుగానే అనుమానించే వారిని హెచ్చరించుతూ, పురాణాల్లోని భవిష్యద్వాణిని ఉల్లేఖించారు. ఈ నమ్మకం ధన్యమగుగాక! మరి ఈ యుక్తికూడ ధన్యమగుగాక!

మా మాటలన్నీ చాలామందికి బాగుండవనీ, ఇందుకు వ్యతిరేకంగా తర్కించాలనుకుంటే, వారూ చాలావాదనలు చేయగలరనీ నాకు తెలుసు. కాని ఇది తర్కించవలసినదిగాని, వాద వివాదాలకు చెందిన విషయంగాని కాదు. ఇది ఆలోచించి అర్థం చేసుకోవలసినదీ, కార్యరూపంలో పెట్టవలసిన విషయమూను. స్వదేశ, విదేశశాస్త్రాల చరిత్ర చదివినవారు,

మాకంటె ఎక్కువగా వివిధజాతుల ఆచారవ్యవహారాలను గురించి అధ్యయనం చేసినవారు వాదించాలనుకుంటే మమ్మల్ని ఓడించగలరు. అయినా మేము మా హృదయవ్యథలోనుంచి బయటకుతీసి, అందరిముందు పెట్టిన సత్యాన్ని కాదనటానికి మాత్రం ఏ మహామహోపాధ్యాయునికీ శక్తి లేదని నిర్భయంగా చెబుతున్నాము.

మాకు గెలుపులభించినా, ఓటమి సంభవించినా, వాస్తవిక సాంఘికసమస్యల పరిష్కారభావం ఎవరిపై మోపాలా అన్నవిషయం బాగా ఆలోచించుకోవాల్సిన సమయంవచ్చింది. ఇంతవరకూ జబర్దస్తీచేస్తూ వచ్చినవారిని కూడా ఆలోచించనివ్వండి-అంటే దుర్గాపూజా సమయంలో మహాష్టమి రెండు ఘడియలు ముందా, వెనకా? పిల్లిని చంపినపాపానికి ప్రాయశ్చిత్తానికి ఒక్క పుంజీరూపాయలు చాలా, ఐదుపుంజీలు కావాలా? మహంత్ మహారాజు వేశ్యనుంచుకుంటే స్వర్గానికి వెళ్తారా, పెళ్ళిచేసుకుంటే నరకానికి వెళ్తారా?—మొదలైన వాటినిగురించి వారినే ఆలోచించనివ్వండి. ఇందుకు మాకేమీ అభ్యంతరంలేదు. కాని సంఘక్షేమం ఎందులోఉంది? ఎందులో కీడువున్నది? ఏ నియమాన్ని మార్చితే, ఏ నియమాన్ని ప్రచారంచేస్తే ఆధునిక సమాజానికి ఏ మేలుగాని, కీడుగాని కలుగుతుంది? స్వదేశశ్రేయంకొరకు విదేశాలు వెళ్ళివస్తే జాతి ఉంటుందా, పోతుందా?—మొదలైనవిషయాల్లో మాత్రం వారు వేలుపెట్టడం అనధికార-చర్చ కాగలదు.

విద్య ఎవరి హృదయాలను ప్రశస్తంచేసి, సార్థకమైనదో వారే వీటిని నిర్ణయించడానికి అర్హులు. సామాజిక

మంచి-చెడ్డలను నిర్ణయించడానికి భగవంతుడే ప్రత్యేకంగా తీర్చిదిద్ది ఈ లోకానికి పంపిన కీ. శే. (శ్రీ) విద్యాసాగర్ వంటి వారికే ఆ అధికారమున్నది. దేశంలో అందరిచే పెద్దవారిని ఎంచబడినవారిపైనే ఈ సాంఘిక సమస్యా పరిష్కారబాధ్యత ఉన్నది. అంతేగాని బ్రాహ్మణపండితులది కాదీ బాధ్యత

శాస్త్రాలు ఎందువల్ల శాస్త్రాలైనవో, వాటిలో యేవి నిజమైనవో, యేవి మోసములో బ్రాహ్మణపండితులు యెలా తెలుసుకోగలరు? అప్పట్లో సమాజంలోవున్న గుణదోషాలేమిటో ఈ పండితులెలా గ్రహించుతారు? వీటన్నిటి పరిశీలన పండితులకు చెందిన ఏ పాఠశాలలో జరుగగలదు? ఇట్టి పరిశీలనచేసే ధైర్యము సాహసం ఏ స్మృతిరత్నాలలో వున్నవి? వీరికి స్వదేశస్థులుమినహా తతిమ్మా దేశస్థులు యావన్మందీ మ్లేచ్ఛులు, అంటరానివారూను. వీరు తమవంటివారు కాని వారంతా అశాస్త్రీయులనుకుంటారు. తమ ఆచార వ్యవహారాలు తప్ప ప్రపంచంలోని తతిమ్మా వారందరి ఆచారవ్యవహారాలు నీచమైనవనుకుంటారు. అంతే తాముతప్ప మరెవరూ మనుష్యులే కాదనుకుంటారు. కాలంతోపాటు నియమాలుకూడా మారుతాయన్న సత్యాన్ని వారు సుతరామూ అంగీకరించరు. కాలానుగుణ్యంగా క్రొత్తబాట ననుసరించడానికి ప్రయత్నాలు జరిగితే వీరు భయాందోళనలు చెందుతారు. ఏడుపులూ, బొబ్బలతో శాస్త్రాల్లో ఈ విషయం ఎక్కడా లేదని నచ్చచెప్పబోతారు. చివరకు వ్యతిరేకిస్తూ తాము దేశాన్ని ఉద్ధరిస్తున్నట్లూ, శాస్త్రాలను రక్షిస్తున్నట్లూ భావిస్తారు.

ఇక మరొక ప్రశ్నకూడా వున్నది. అది ఏమంటే మీరు శాస్త్రాలను అనుసరిస్తున్నారా? అని. శాస్త్రాల్లో రాక్షస, అసుర వివాహాలున్నాయి. శాస్త్రాలలో కన్యల క్రయంవుంది. శాస్త్రాలలో అశాస్త్రీయ సంతానం అంగీకరింపబడింది. నేడు అవన్నీ అమలుపర్చడం ప్రారంభిస్తే మీరు ఒప్పుకుంటారా ? "మీరు వీటినెందుకు ఒప్పుకోరు?" అని అడిగితే వీరు సరియైన సమాధానం చెప్పలేరు. అటుత్రిప్పి యిటుత్రిప్పి ఆ సంగతీ యీ సంగతీ యెత్తి, అది దేశాచారం కాదని, అవసరమైనవి కాదని, మంచివి కావని, మానవుని నైతికబుద్ధి అంగీకరించని విషయాలని ఏమేమో చెప్పి సమర్థించుకోజూస్తారు: ఒకవేళ యివన్నీ ఏ శాస్త్రంలోనైనా "ఉంటే ఉండనివ్వండి, ఫలానా శాస్త్రంలో అందుకు వ్యతిరేకంగాకూడా శ్లోకాలున్నాయి. ఇలా మనయిళ్ళల్లో గాంధర్వ వివాహాలు, అశాస్త్రీయ సంతానోత్పత్తిని మేము అంగీకరించం సరిగదా, మరెక్కడైనా జరిగితే మా నోటికివచ్చిన తిట్లన్నీ ఉపయోగిస్తాము" అంటారు.

అసలువిషయం ఏమంటే "మాకు యిష్టంలేదు" అనేదే. తమ అభిప్రాయాలతో సరిపోయేశాస్త్రానికి వెంటనే ముద్ర పడిపోతుంది. సరిపోనిశాస్త్రాన్ని దేవుడే దిగివచ్చి నడిబజార్లో నిలబడి అరచిచెప్పినా అంగీకరించరు. ప్రత్యేకసందర్భాలలో ఆ శాస్త్రంవల్ల ఎవరికైనా బాధకలుగవచ్చు గాక; కాని సాధారణ వాంఛల ప్రభావంవల్ల ఆ బాధ యెంతో కాలం వుండదు. పైగా ఆబాధ ఉత్తమోత్తమ ధర్మమనే రూపాన్ని పొంది పరలోకంలో యింతకంటే వందలరెట్లు అధిక ఫలం లభిస్తుందనే అభయాన్నిచ్చి మనిషిని తృప్తిపరుస్తుంది.

పురుషులకు కలిగే దుఃఖం క్షణంలోనే దూరమైపోతుంది; కాని, ఎల్లప్పుడూ దుఃఖాన్ని అనుభవించవలసినది మాత్రం స్త్రీయే.

మనదేశంలోని 'పూజనీయు'లైన స్త్రీలను పూజించే విధానం తెలిపాము. ఆ 'పూజ'ను ఆదర్శంగాగొని కీర్తిని పొందే పురుషులతో మేము చెప్పే దేమీలేదు. మేము విదేశ విధానాలూ చూచాము. అక్కడా ఇదేస్థితి. నాలు గైదువేల సంవత్సరాలక్రిందట మరుగుపడిన ఒక చట్ట నిబంధనలో "ఏ భార్యఅయినా భర్తను అసహ్యించుకుని, భర్తతో 'నువ్వు నాభర్తవుకాదు' అని అనేటట్లయితే ఆభార్యను నదిలో త్రోసివేయవలెను" అని వ్రాసిఉన్నది. మరొకసూత్రంలో "ఏభర్త అయినా తనభార్యతో 'నువ్వు నా భార్యవుకావు' అని అనేటట్లైతే ఆమెకు అర్థ మీనాఎత్తు వెండియిచ్చియింట్లో నుంచి గెంటివేయవలెను" అని వ్రాసిఉన్నది.

ఎంత సూక్ష్మన్యాయం! అర్థమీనాఎత్తు వెండి ఎంత ఉంటుందో మనం చెప్పలేముగాని, అది ఎంతైనప్పటికీ నీటిలో ముంచి చంపివేయడానికి త్రాసుసిబ్బెలో పెట్టి తూచుటకూ సాదృశ్యంలేదని చెప్పగలము. ప్రాచీన బాబిలోనియన్ శాసనాలలోకూడా 137 నుంచి 143 సెక్షనువరకూ ఇలాంటి ఏర్పాట్లే పేర్కొనబడ్డాయి. అయితే ఆ బాబిలోనియన్ విధానము యూదులవిధానంకంటే వేయిరెట్లు మెరుగని చెప్పవచ్చును. కొద్దిరోజులక్రితమే ఐరోపా స్త్రీలనుగురించి అనేకులు యిలా వ్రాశారు: "స్త్రీ తండ్రినుండి భర్తకు ఊడిగం చెయ్యడానికి

అమ్మివేయబడుతూ ఉండేది. అప్పుడు ఆమెకు వర్తింపజేసే న్యాయసూత్రాలకు ఆమె సోదరునిపట్ల వర్తింపజేయబడే న్యాయసూత్రాలకూ సంబంధమే లేదు.”

మరికొంతమంది “కూలీల భార్యలు జమీందారుల ఆస్తితో సమానంగా వుండేవారు. వారు చేయవలసివచ్చే శారీరకశ్రమకు అంతమంటూ ఉండేదికాదు” అని వ్రాశారు.

కొన్నిచోట్ల పైపై మెరుగులుంటే, మరికొన్నిచోట్ల లోలోపల మార్పులకు ప్రయత్నాలు జరుగుతూ ఉండేవి. ఆ మార్పులకు స్త్రీలే బాధ్యతవహించారు. పురుషుడు సహాయకారిగానైనా వారికి మేలు చేకూర్చుటకు ఎన్నడూ సిద్ధపడనూ లేదు, ఇంకెప్పుడూ సిద్ధపడకూడదు. పురుషుల్లో మిల్, కండోర్‌సెట్‌లాంటి మంచివారు స్త్రీలయెడల జాలిపడి పుస్తకాలు వ్రాశారు. ప్రాచీనకాలంలో ప్లేటోకూడా తన ‘రిపబ్లిక్’ అనే పుస్తకంలో యిలా వ్రాశాడు—“మనం ఇంటిపనుల్లో, అంధకారంలో ఉంచివేస్తున్న స్త్రీలు ఉత్తమమైన, ఉన్నత కార్యనిర్వహణకు ఉపయోగపడరా? స్త్రీలలో సాహసము, తెలివితేటలు, అన్నికళలలో ప్రావీణ్యతచూపిన ఉదాహరణలు లేవా? వారి ఈ గుణాలలో కొంత దౌర్బల్యంలేకపోలేదు; కాని అంతమాత్రంచేతనే వారు దేశానికి పనికిరాని వారా?” మేము దీన్నిగురించి ఎక్కువగా వ్యాఖ్యానించదలచలేదు. అయితే వీరిలో సదభిప్రాయం లేదనడం అన్యాయమే అవుతుంది. ఏమైనా, ఒకటిమాత్రం నిశ్చయం. వీరి ఈ రకమైన మాటలవల్ల ప్రయోజనమేమీ కలుగలేదు. ఇందుకు వీరి

ప్రయత్నాల్లో వాస్తవమైన పట్టుదల లేకపోవడమే కారణమేమో ననిపిస్తుంది.

పుస్తకాల్లో వ్రాతలకుమినహా పురుషులు స్త్రీలకు యదార్థగౌరవమిచ్చినట్లులేదు. ఏ దేశంలోనైనా స్త్రీలు యదార్థ గౌరవాన్ని పొందారంటే, అది వారి స్వయంకృషివల్లనే. ప్రాచీన ఈజిప్టులో ఇట్టి ప్రయత్నమే జరిగింది. ఆ తాకిడి రోమ్ వరకూ తగిలింది. మన దేశంలోనూ ఇలాంటిదే జరిగింది. అది స్త్రీలు వేదరచనకు సాహసించిన రోజుల్లో జరిగింది. కాని నేడో? వారికి వేదాలను స్పృశించే అధికారంకూడా లేదు. పురుషుల ముఖతా 'దేవి' అనే సంబోధన విని తన్మయత్వం చెందక, వారు అన్నదానిని కార్యరూపంలో పెట్టక తప్పని పరిస్థితిని కల్పించిన రోజుల్లో మాత్రమే స్త్రీకి యదార్థమైన విలువవున్నది.

ఇప్పుడు మేము ఆధునికయుగంలోని ఉదాహరణ ఒకటి యిస్తున్నాము. ఈ దేశంలో వితంతు వివాహసమస్యనుగూర్చి విపరీతమైన ఆందోళన చెలరేగింది. వితంతు వివాహాలసమర్థకులు చాలమంది ఎంతో ఆలోచించి చివరకు చిన్నతనంలో భర్తపోతే మళ్ళీ వివాహం చెయ్యకపోవడంవల్లనే బెంగాలులో కులభ్రష్టలసంఖ్య రోజురోజుకు పెరుగుతోందనీ, కాబట్టి విధవావివాహాలకు యిదీ ఒక హేతువేననీ వాదించారు. అప్పుడు రెండుపక్షాలమధ్య వితంతు వివాహాలు జరగాలా వద్దా అని సంకులసమరం సాగుతోంది. కాని, వితంతు వివాహాలను వ్యతిరేకులైనవారు కూడా పునర్వివాహాలు చెయ్యకపోవడంవల్లనే విధవలు చాలమంది కుల

త్యాగం చేస్తున్నారన్న విషయం అంగీకరించారు. స్త్రీలలో కులభ్రష్టలసంఖ్య పెరుగుతోందనేసరికి వితంతువులు కాక ఇంకెవరు కులాన్నివదలి, అనాచారాలకు దిగజారుతారు? అని పురుషమాత్రుడైన ప్రతీవాడూ అంగీకరించాడన్నమాట! కాబట్టి ఇంకా ఎలాంటి కఠిననియమాలుమోపి, తలవెంట్రుకలు తీయించి, వికృతరూపమిచ్చి ఎముకలువిరిగే పరిశ్రమ చేయించి, శరీరాన్ని శుష్కింపజేసి, దీక్ష, వ్రతాలు పట్టించి, ఎలా ఈ అశుభాన్నుంచి ఆమెను రక్షించగలమా అని ఆలోచన ప్రారంభించారు. నేటికీ యింకా ఈ ధోరణిపోలేదు. ఇప్పటికీ పత్రికలలో వితంతువులను అదుపులో పెట్టడానికి తల్లిదండ్రుల కర్తవ్యం ఏమిటి అనే విషయాలపై అప్పుడప్పుడు వ్యాసాలు వస్తూనే ఉన్నాయి. అసలు స్త్రీల కాళ్ళకు బంధాలు వెయ్యకపోతే వారెక్కడ బయటికి వచ్చేస్తారోనని పురుషులకు మొదటినుంచీ భయముండేది. కొంతమంది "విశ్వాసో నైవ కర్తవ్యః" అంటారు; మరికొంతమంది ఇంకొక అడుగు ముందేకువేసి "అంకే స్థితాపి" అంటారు; ఇంకా కొందరు దీనితోకూడా సంతృప్తిచెందక "దేవా న జానన్తి" అంటారు.

దీనివల్ల పూజనీయులైన స్త్రీల గౌరవం పెంపొందదనే విషయం ఇక్కడ విశదపరచవలసిన అవసరం ఉండదు. పురుషుల ఏ సంస్కార ప్రభావంవల్ల ఇన్ని విధినిషేధాలు శాఖోపశాఖలుగా ఉత్పన్నమై పెంపొందాయనే విషయంలోకూడ భిన్నాభిప్రాయాలు లేవనే మా అభిప్రాయం. వితంతువివాహాలు మంచివా చెడ్డవా యనికూడ మేమిక్కడ ప్రశ్నించ

దలచలేదు. కాని వితంతువివాహాలు చేయనందువల్ల నే స్త్రీలను సన్మార్గంలో వుంచడం కష్టం గనుక, వితంతువివాహాలు చెయ్యాలని వాదించేటట్లయితేమాత్రం వితంతువివాహాలు చేయకుండావుండటమే శ్రేయస్కరమని చెబుతాము.

కాని, నిజంగా ఇది సబబైనదేనా? వితంతువులు మాత్రమే రాత్రింబవళ్లు ఎప్పుడు వీలుదొరుకుతుందా, బయటికి పారిపోదామా అని కాచుకొనివుంటున్నారా? అని ఆలోచించ కుండానే పురుషులు ఈ నిర్ధారణ చేసుకొన్నారు. వారీ విష యాన్నిగురించి తమ అభిప్రాయం స్థిరపరచుకొనేముందు తాము నమ్మినదాన్ని ప్రచారం చేసేముందు ఏ అపరాధమూ దోషమూ లేకుండానే స్త్రీత్వానికి ఎటువంటికళంకం ఆపాదిస్తు న్నారో ఒక్కసారి అయినా ఆలోచించారా?

ఒక సుప్రసిద్ధ విదేశీతత్వవేత్త "బానిసవ్యాపారం అన్ని అవగుణాలకు మూలం" అన్నట్లుగా వేశ్యావృత్తే అన్ని పతనా లకు నిలయం. స్వదేశాన్నిగురించి చెప్పడానికి ధైర్యంచాలకనే ఇక్కడ నేను విదేశవిషయం యెత్తాను. ఎందుకంటే మన తత్వవేత్తలు ఈ దేశస్వర్గంలోనే ఉంటూంటారు. మరి వీరికి కోపంవచ్చి శపించారంటే అది ఋషీశ్వర్ల శాపంకంటె తక్కువదికాదు! ఏమయినప్పటికీ, విదేశీయుల విషయమే తీసు కున్నా, యింత పతనంకావడానికే స్త్రీలు రాత్రింబవళ్లుకాచుకు కూర్చుంటున్నారా? మరి నారీస్వభావచరిత్ర ఇంతపశుత్వంతో కూడుకొని ఉన్నదా?

దీనికి పురుషుడు అహంకారంతో "అవును, ఇదే స్త్రీ నిజస్వరూప"మని జవాబిస్తాడు. స్త్రీ తన సంకుచిత స్వాభి

మానంతో 'కాదు' అని జవాబిస్తుంది. కాని వాస్తవంగా దీనినిగురించి పరిశీలించినట్లయితే, ఒక ఊహాచిత్రాన్ని చిత్రించుకొని, కల్పితసమాధాన మివ్వదలచినట్లయితే తర్కం కొనసాగుతూనే వుంటుంది. ఇందువల్ల, తరచిచూస్తే ఏంజవాబు వస్తుందోనన్నదే మేము సూచిస్తున్నాము.

పది-పన్నెండు సంవత్సరాలనాటి సంగతి. ఒక పెద్ద మనిషి బెంగాలులో చెడిపోయిన స్త్రీల చరిత్ర సంకలనానికి పూనుకున్నాడు. ఆ పుస్తకంలో వివిధ జిల్లాలకు చెందిన వేలమంది హతభాగినుల చిరునామాలు, వయస్సు, కుల-గోత్రాలు, కులత్యాగానికి కారణాలు-అన్ని వివరాలు యివ్వబడినయి. కాని ఒకనాడు ఆ యింటికి నిప్పంటుకోవడంవల్ల అతని గ్రంథంకూడా కాలిపోయింది. కాలిపోవడం మంచిదే. కాబట్టి యిప్పు డెవరైనా ఋజువు అడిగితేమాత్రం ఇవ్వలేము. కాని, ఆ విషయం మొదటినుండి చివరివరకూ మాకు పూర్తిగా జ్ఞాపకంవున్నది. లెఖ్ఖ వేసేటప్పటికి ఆ చెడిపోయిన స్త్రీలలో నూటికి డెబ్భైమంది సధవలు. మిగతా ముప్పదిమంది మాత్రమే వితంతువులూనని తెలుసుకొని ఆశ్చర్యపోయాము. వారందరూ కులాన్ని త్యజించడానికి కారణం ఘోరదారిద్ర్యం, భర్తలదౌష్ట్యం, అత్యాచారాలేనని వ్రాయబడింది. ఆ సధవలలో అత్యధికసంఖ్యాకులు నీచజాతులకు చెందినవాళ్లు. వితంతువులు మాత్రం అగ్రజాతులకు చెందినవాళ్లు. నీచజాతులకు చెందిన సధవలు "మాకు తినటానికి తిండీ, కట్టుకోడానికి గుడ్డా లేవు. పగలల్లా ఉపవాసాలు, రాత్రిళ్లు భర్తల చేతి దెబ్బలూ భరించలేకపోయా"మని చెప్పారు. అగ్రజాతి వితం

తువులు 'బావలు, మరదులు, అత్త-మామలు, ఆడబిడ్డలు, తోడికోడళ్లు వగైరాల అత్యాచారాలు భరించలేక మే మా పనిచేశా'మన్నారు. వీ రందరూ చెప్పినవన్నీ నూటికి నూరు పాళ్ళూ నిజమేనని నమ్మమనికాదు. కాని శ్రద్ధగా ఈ విష యాలన్నీ ఆలోచించి తేమాత్రం ఇవన్నీ చాలవరకు నిజమే ననిపిస్తుంది.

అగ్రజాతులకు చెందిన వితంతువులు భర్త చనిపోవడం తోనే ఎలా నిరాధారులౌతారో అలానే భర్త ఉన్నప్పటికీ తక్కువజాతి స్త్రీలు నిరాధారులుగా వుంటున్నారు. కాని నీచ జాతి వితంతువులస్థితి అగ్రజాతి వితంతువులస్థితికంటె మెరుగ్గా వుంటున్నది. ఎందువల్లనంటే భర్త చనిపోవడంవల్ల వారికే నామర్దా భయమూ కలుగదు. స్వతంత్రులై సంతలకు, మార్కెట్లకు వెళ్ళి శ్రమచేస్తారు. ధాన్యం దంచుతారు. కూలి-నాలి చేస్తారు. అవసరమైతే దాసీపనికూడ చేస్తారు. కాబట్టి ఎవ్వరి ఆటూపోటూ లేక నిశ్చింతగా స్వతంత్రజీవనం గడపడం వారికి సహజమౌతుంది. అలా చేస్తారుకూడాను. కనుక వాళ్లు కులాన్ని త్యజించాల్సిన అవసరంవుండదు. కులాన్ని త్యజించరు కూడాను. కాని ఆ సధవలకుమాత్రం ఈ స్వేచ్ఛవుండదు. వారు స్వయంగా ఏపనీ చెయ్యలేరు. చెయ్యడానికి వీలుండదు. పైగా భర్త పోషించలేకపోయినా చావుదెబ్బలుకొట్టి అధికారం చలాయిస్తాడు. ఇందువల్ల నేనేమో బెంగాలిలో ఒకసామెత చాలా ప్రసిద్ధిచెందింది. దానిభావం "తిండీ బట్టా ఇవ్వడానికి ఎవడూలేడుగాని, తన్నులు తన్నడానికిమాత్రం మొగుడు

తయారు" అని. ఇక్కడ ఈ సామెత వ్రాసి బెంగాలులోని నీచ జాతులవారిలో ఈ విషయం ఎంతవరకు నిజమో ఎంతదుఃఖ ఫలితంగా ఈ సామెత వచ్చిందో సరిగా చెప్పలేము.

అగ్రజాతులకు చెందిన వితంతువులస్థితి నీచజాతి సధవలస్థితితో కలుస్తుంది. కారణమేమంటే ఇటు కన్నవారి గౌరవము, అటు అత్తవారి మర్యాదకు భంగమని, వారికి శారీరక కష్టంచేసి, స్వతంత్రంగా జీవితం గడపటానికి తగిన అవకాశం యివ్వరు. కాని వాస్తవంగా అగ్రకులాల వితంతువులస్థితి ఎవరికి తెలియనిదికాదు. మే మీ విషయాన్ని గురించి ఇదివరకే చాలసార్లు చెప్పాము. దీనివల్ల నూటికి తొంభైమంది అభాగినులు అన్నవస్త్రాల లోపంవల్ల, బంధు-బాంధవుల అనాదరణ, ఉపేక్ష, అత్యాచారాలవల్ల యిళ్ళు వదలిపెడుతున్నారే గాని, కామపీడితలైనందున కాదనేవిషయం; తేటతెల్లమవుతుంది. కులాన్ని త్యజించే స్త్రీలలో విధవలకంటే సధవలే ఎక్కువగా వుండడానికి కారణంకూడ ఇదే.

కాని పురుషులుమాత్రం ఈ విషయాన్ని గురించి ఏ మాత్రం ఆలోచించకుండానే, కేవలం విధవలుమాత్రమే కులాన్ని త్యజిస్తున్నారన్న అభిప్రాయిం స్థిరపరచుకొని వారిని కఠిన విధి-నిషేధాలద్వారానే అణచివుంచాలని నిశ్చయించుకొన్నారు. కాని వాస్తవంలో భర్తలున్న భార్యలే ఎక్కువమంది కులాన్ని త్యజిస్తున్నారనీ, అదీ పురుషుల ఒత్తిడి, అత్యాచారముల వల్లేనని ఏ పురుషుడైనా అంగీకరిస్తాడా?

ఒకవైపున పురుషుడు, దారిద్ర్యం, చెప్పరాని బాధలతో స్త్రీ కోమలహృదయాన్ని వికృతంచేసి ఆమె ఇంటిలో

వుండడం ఎలా అసంభవంచేసివేస్తున్నాడో, రెండో వైపున ఆ విధంగానే ఆ స్త్రీనే అనేక మధురసుఖాల ఆశచూపి మోస గించి ఇంటినుండి లేవదీసుకుపోతున్నాడు. తనకు ఇష్టమైనంత కాలం సుఖభోగాల్ని అనుభవించి కావాలనుకున్నప్పుడు అతడు తిరిగి ఇంటికివెళ్ళగల్గిన స్వాతంత్ర్యం వుండుటచే పురు షుని కేవిధమైన భయమూ లేదు. ఇంటికి తిరిగివచ్చి రెండు మూడురోజులు విచారంగా ఒకమూల కూర్చుంటే, వెంటనే బంధుమిత్రులందరూ చేరి ధైర్యంచెపుతూ 'దానికేమున్నదిలే; ఇలా జరగటం మామూలే, పురుషునికి దోషంలేదు. రా, బయటికి రా' అని ఓదారుస్తారు. అప్పుడు అతనుకూడ నవ్వు లొలికిస్తూ బయటికివస్తాడు. ఇంక తానూ "స్త్రీలు తప్పు టడుగువేస్తే మరి ఏవిధంగానూ పవిత్రంచేయలేం!" అని బిగ్గ రగా అరుస్తూ ప్రచారం ప్రారంభిస్తాడు.

నిజమే మరి. ఏ కారణంవల్లనైతేనేం, స్త్రీ ఒకసారి తప్పుచేస్తే, యింక ఆమెతో హిందువుడు ఎలాంటిసంపర్కం వుంచుకోడు. ఆ తర్వాత ఆ తప్పిదమే ఆమె జీవితంలో పాపంగా పరిణమించి, ఆమె వేశ్యగా తయారైతే, మళ్ళా ఆ వేశ్య లేక పోయినా హిందువులస్వర్గం సర్వాంగసుందరం కాజాలదు ! ఆమె అంత అవసరమైనదిగా భావించబడుతోంది !

మన దేశంలో శ్రీకృష్ణునికి "నీలమేఘశ్యాముడు" లాంటి అష్టోత్తర శతనామముపెట్టారే, అలాగే సంస్కృత సాహి త్యంలో వేశ్యకు గౌరవనామములు అంతకంటె తక్కువలేవని పిస్తుంది. ఏ టన్నిటివల్ల స్వార్థపరత్వం, శీలసంబంధమైన

పాపబుద్ధి స్త్రీలలో అధికమో, పురుషులలో ఎక్కువో స్పష్టమౌతోంది. ఇంతేగాక సమాజంలోంచి ఈ పాపాన్ని బహిష్కరించాలంటే శాస్త్రాలలో ఎవర్ని గురించి ఎక్కువ కఠోర నియమాలు వుంచాలో కూడా విశదమవుతుంది. సాంఘికజీవితాన్ని పవిత్రంగా వుంచడానికి జాగ్రత్తగా కన్ను వేసివుంచి అధికంగా శిక్షించవలసినది స్త్రీనా మగవాడినా? అనేదికూడ స్పష్టపడుతుంది.

స్త్రీ తప్పిదాన్నిగాని స్త్రీ భ్రమలనుగాని సమాజం చిన్న మెత్తుకూడా క్షమించదు. కాని, పురుషుని తప్పులను పదహారణాలా క్షమిస్తుంది. దీనికి కారణం ఏమిటి? కారణమల్లా పురుషుని జబర్దస్తీయే. దీనికి కారణం సమాజం అంటే పురుషుడే. దానికి స్త్రీ అనే అర్థం ఎక్కడా లేదు. స్త్రీని పురుషుడు ద్వేషిస్తాడు. పురుషునికి ద్వేషించే అధికారం యివ్వబడింది. కాని స్త్రీకా అధికారంలేదు. పురుషుడు ఎంత అసహ్యించుకోవలసినవాడైతేనేం, అతడు భర్త. మరి భర్తను స్త్రీ ఎలా ద్వేషించగలుగుతుంది? పతి ఎలాంటివాడైనా పతివ్రతయైన స్త్రీకి అతడే దేవత; ఆ దేవత చనిపోతే ఆమె అతని చరణకమలాలు తనఒడిలో పెట్టుకొని అతన్ని అనుసరించాలి. ఈయుగంలో అయితే కనీసం ఆయన పాదపద్మాలను స్మరిస్తూ జీవన్మృతురాలుగాఉండడంమే స్త్రీత్వమని శాస్త్రాలుఘోషిస్తున్నాయి.

కొంతమంది వైజ్ఞానికపద్ధతిలో వాదన ప్రారంభించి, భావివంశోద్ధారకులను దృష్టిలో పెట్టుకుని చూస్తే స్త్రీల పొరపాటు, భ్రమలవల్లనే హానికలుగుతున్నది; పురుషుని భ్రమ,

పొరపాట్లవల్ల హానిలేదని వాదిస్తారు. కాని ఎంతమంది సతీమణులు దారితప్పిన స్త్రీల కుత్సితమైన వ్యాధులకు గురియై యమబాధ లనుభవిస్తున్నారో, వారు ఎలాంటి రోగిష్టి సంతానాన్ని కనవలసివస్తున్నదో, ఆ సంతానం ఆజన్మరోగిష్టులై, జీవితాంతం తమ తాతల తండ్రుల దుష్కర్మలకు ప్రాయశ్చిత్తంగా తమ జీవితాలను నాశనం చేసుకోవలసివస్తోందో డాక్టర్లకు బాగా తెలుసు. కాని శాస్త్రాలు ఈ విషయంలో అస్పష్టంగానూ, సమాజం మౌనంగానూ ఉన్నాయి. శాస్త్రాలలో వీటినిగురించి ఏమైనావుంటే అవి సారహీనంగావున్నాయి. పురుషుల కోర్కెలు, అభిరుచిలే ముఖ్యం. అవే నిజమైన సామాజిక నీతి. మనువు, పరాశర, హారీతలగురించి చెప్పుకోవడం అవసరం. పురుషుకు తన భార్యకళ్ళముందే ఎంత అన్యాయమైనా అధర్మమైనా చేయవచ్చు. కాని స్త్రీ తన సతీత్వాన్ని కాపాడుకొనుటకుగాను నోరుమూసుకుని ఊరుకోవాలి. మరి శాస్త్రవాక్యంకదూ! ఇంతేనా? బుద్ధిపూర్వకంగా పురుషుని నికృష్టరోగాలన్నిటినీ తన శరీరంలోకి సంక్రమింపజేసుకోవాలి. ఆహా! స్త్రీకి యింతకంటే అగౌరవకరమైన విషయం ఏముంటుంది?

యితర దేశాలలో అయితే విడాకుల ఆచారం ఉంది. అందుచేత అక్కడి స్త్రీలకు కొంతవరకైనా అవకాశాలు వున్నాయి. కాని మన దేశంలో, అంటే స్వయంగా భగవంతుని దేశంలో – ఈ దేశంలోని శాస్త్రాలతో సరితూగగల శాస్త్రాలు మరెక్కడా లేవనుకునే దేశంలో — ఈ దేశ ఉత్తమధర్మంలాంటిది మరే దేశంలోను లేదనుకునే చోట జన్మించినమాత్రాన

మనిషి మానవాతీతుడై పోతాడనుకునే దేశంలో— స్త్రీలకు ఏమాత్రం దారికూడా లేదు. ఈ దేశంలోని పురుషులు తమ స్త్రీలను కాళ్లూ-చేతులూ కట్టి కొట్టినా బాదినా ఆ స్త్రీ కిక్కురుమనరాదు. అందుచేతనే కాబోలు ఈ దేశంలోని పురుషులు సంతోషంతో గంతులువేస్తూ తమదేశంలోని స్త్రీలవంటి ఓర్పు, సహనంగల స్త్రీలు ప్రపంచంలో యింకెక్కడున్నారని ప్రగల్భాలు పలుకుతారు.

అవును; ప్రపంచంలో మరెక్కడా లేరని మేమూ ఒప్పుకుంటాము. కాని ఏ కారణాలవల్ల లేరో అవి పురుషుడు గర్వించతగ్గ కారణాలేనా? ఏ విదేశ వార్తాపత్రికలోనో ఫలానా, ఫలానా భార్యా-భర్తలు విడాకులకొరకు కోర్టులో దావా వేసుకున్నారు అని వార్తవస్తే, మనదేశంలోని పత్రికా సంపాదకులు ఎగిరిపడుతూ వాటినిగురించే వేలెత్తిచూపుతూ “చూశారా! ఇదే విదేశీసభ్యత!” అని వ్యాఖ్యానిస్తున్నారు.

ఎదటివారి దోషాలను ఎత్తిచూపితే తమ సద్గుణాలు వాటంతట అవే నలుగురికీ వెల్లడవుతాయని వీరి ఉద్దేశం. ఆ విదేశీయులకుకూడా విడాకులు వాంఛనీయంకాదని తెలుసు. అయితేమాత్రం దెబ్బలుపడి పశువుల్లాగా పడిఉండరు. అక్కడ కూడా భార్యాభర్తల తగాదా అంటే రహస్యంగా ఉండేదేమీ కాదు. అది పదిమందికీ తెలుస్తుంది. అప్పుడు ఇతరులు బాగా హేళనచేస్తారు, యితరదేశాల్లో ఏ కారణాలవల్ల యిలాంటి కేసులు కోర్టులకు వెళుతున్నాయో ఆ కారణాలు మనదేశంలో లేవా అంటే ఎంత సిగ్గుమాలినవాడైనా ఆ కారణాలు మన

దేశంలో లేవు అని అనలేదు. అలాంటప్పుడు మనం ప్రత్యేకంగా సంతోషించే అవకాశమేదీ? కేసులు మాత్రమేనా పట్టించుకోదగినవి? వాటి కారణాలు పట్టించుకోనక్కరలేదా?

ఆ దేశాల్లోకూడా ఒకప్పుడు విడాకులు ఉండేవికావు. కాని మధ్యయుగంలో ఏర్పడిన అనంతహైన్యంవల్ల వారిలో చైతన్యం కలిగింది. ఈ సందర్భంలో ఇలా చెప్పబడింది— "విడాకుల విషయమై చర్చి, మతము, మూర్ఖకాఠిన్యం వహించడంవల్ల సమాజంలో అవ్యవస్థ, లజ్జాకరమైన విషయాలు వృద్ధిచెందాయి. పురుషుల్లోనూ, స్త్రీలల్లోనూ వ్యభిచారం బాగా ఎక్కువైపోయింది. పురుషులదృష్టిలో స్త్రీల విలువ పూర్తిగా పడిపోయింది. దానివల్ల ఇంటిపనుల్లో స్త్రీలకు ఎంతసేపూ పురుషులను సంతృప్తిపరచాలనే దృష్టి అధికమయింది. శాస్త్రాల కాఠిన్యం ఇలా స్త్రీలను ఎంతటిదుఃఖానికి దైన్యానికి లోనుగావించిందో ఆచార్య కె. పియర్సన్ తన "Ethics of Free Thought" అనే పుస్తకంలో వ్రాశారు. స్త్రీలందరూ ఈ పుస్తకాన్ని తప్పక చదవాలని మా కోరిక.

మా ఈ వాదనవల్ల మేమేదో విడాకులు మంచివని వాదిస్తున్నామని పాఠకులు భ్రమపడవద్దు. తగాదాలు, కొట్లాటలుకూడా మంచివికావుగదా. సమాజంలో ఈ కొట్లాటలు, అశాంతి ఉండాలని ఎవరూ వాంఛించరు. కాని మన సమాజంలో స్త్రీలను త్యజించడం పరిపాటిగా ఉన్నప్పుడు అది స్త్రీ

పురుషపక్షాలు రెండింటికీ ఎందుకు వర్తించరాదు ? స్త్రీ పురుషుని ఎందుకు త్యజించకూడదు?

పురుషుడు సాధారణంగా తనవలెనే తన స్త్రీకికూడా త్యజించేహక్కు ఉండాలని అనుకోడు. అయితే అలాఎందుకు ఉండరాదో, ఇతర దేశాలలోని స్త్రీలకున్నట్లు తన దేశంలోని స్త్రీలకు కూడా విడాకులహక్కు ఏల ఇవ్వరాదో సకారణంగా నిరూపించలేడు. కాబట్టి మండిపడి అసహ్యంతో "ఛీ:- ఏం మాట!" అనిమాత్రమే అంటాడు.

అన్నను మరి; అపరాధాలు చేయడానికి తనకుగల స్వాతంత్ర్యం తగ్గిపోతుందాయె. అందులోనూ మన దేశంలోని పురుషులు పిరికిపందలూ, అసమర్థులయి, ఇతర దేశాల పురుషులతో పోల్చుకుంటే స్త్రీలవలె నిరుపాయులై, స్త్రీలఎదుట పురుషసింహాలుగా చెలామణి చేసుకోగల యోగ్యతలేనివారు తమ కంటె బలహీనులను పీడించి, హింసించి తమ కర్తృత్వపాలనా ఆనందాన్ని పొందగోరుతారు. ఇంతకంటె వారు చేయగలిగేదేమున్నది? వాళ్ళు చవిచూసిన యీనతర్వాతనైనా తమ అధికారంలో పీసమెత్తుకూడా బుద్ధిపూర్వకంగా వదులుకోడానికి ఇచ్ఛగించరు. అంతేగాదు, శాస్త్రాలను అడ్డుపెట్టుకుంటారు; విజ్ఞానాన్ని ఏకరువుపెడతారు; నీతి-సాంప్రదాయాలనే కపట నాటకంకూడా ఆడుతారు. ఇక స్త్రీలుకూడా విషయాలు గ్రహించేసమయం వచ్చింది. తనవల్లనే స్త్రీ రక్షింపబడజాలదని తెలుసుకున్న పురుషుడు "పథి నారీ వివర్జితా" అనే శాస్త్రసిద్ధాంతాన్ని తయారుచేశాడు. అతని ఆ శాస్త్రాని కూడా అంతే విలువయివ్వడం ఉచితము; న్యాయంకూడాను.

ఈ మాటలన్నీ పురుషులకు ఎంతో అప్రియంగా ఉండవచ్చు. అందుచేత వారీ విషయాలను తమ అంతఃపురాలవరకూ వెళ్ళనీయరు కూడాను. కాని అర్థంలేకుండా అత్యాచారాలు జరిగే దేశంలో నేడుకాకపోతే రేపైనా అచటి స్త్రీలు అందుకు కారణం తెలుసుకొనుటకై ప్రయత్నించక మానరు. ఇది పురుషులకు ఇష్టమైనా, కాకపోయినా తప్పదు. “స్త్రీలు రాజకీయాలలో ప్రవేశించడం నాకుఇష్టంలేదు” అన్న నెపోలియనుకు మేడం కండోర్సెట్ “అవును, సేనాపతి మహాశయా! మీరు చెప్పింది యదార్థమే; కాని స్త్రీల శిరస్సులు ఖండించడం ఆచారంగాగల దేశంలో అలా తమశిరస్సులెందుకు ఖండించబడుతున్నాయో తెలుసుకోనగోరడం సహాజమే” అని సమాధానమిచ్చింది.

మనిషి మనిషిగా రూపొందనప్పుడుకూడా అతనికి అవిచ్ఛిన్నమైన కార్యకారణ సంబంధంయొక్క దిగ్మాత్రసూచన తెలిసియుండునని నేటి పండితులు కాదనడంలేదు.

ఆదిమావస్థలో సత్త్వలె ఉన్నప్పుడుకూడా మేఘచ్ఛాయల్లో సూర్యుడు కప్పబడడంచూచి భయపడి ఆత్మరక్షణకు పూనుకునేవాడు. ఆ ఛాయ కేవలం ఛాయమాత్రమేకాదు, దానితో మరేదో కూడా వస్తుందని అతనికి తెలిసిపోయింది. పైగా ఆ వచ్చేది ప్రబలమైనదనీ, త్వరలోనేననీ తనకు హాని చేకూరుస్తుందనీ అతనికి భయంగానేవుండేది. కాబట్టే ఛాయ అనే కారణంతోనే జరుగనున్నదానిని పసికట్టి, తన శరీర దుర్గద్వారాన్ని మూసివేసుకున్నాడు. వరుసక్రమంలో జీవితం ఉన్నతిచెందే విషయం సత్యమని స్వీకరించబడినతర్వాత మాన

సిక విజ్ఞానసంబంధమైన పుస్తకాలన్నిటిలోనూ మానవుని శరీరంతోపాటు బుద్ధికూడా వికసిస్తూవచ్చిందని చెప్పబడింది. అందుచేతనే మనిషి పశుప్రవృత్తిని వదలి ఎంతో ఉన్నతిచెందాడని చెప్పుతున్నప్పటికీ కొన్నికొన్ని సందార్భాలలో అతను పశుప్రవృత్తులవేపు లాగివేయబడుతూ ఉంటాడనే విషయం కూడా ఒప్పుకోక తప్పదు. ఈ భేదము పరిణామగతమేగాని ప్రకృతిగతం కాదు. ఈ సత్యాన్ని బాగుగా గ్రహించి మనం పశువులనేనాటిలో అసలు స్త్రీ (ఆడ) ఏమైనా విలువ ఉన్నదా లేదా అని చూస్తే ఉన్నది అని స్పష్టంగా బోధపడుతుంది. రెండు మొగసింహాలు ప్రాణాంతకంగా పోట్లాడుకుంటూవుంటే ఆడసింహం చూస్తూఉంటుంది. వాటిలో జయించిన సింహంతో ఆడసింహం నెమ్మదిగా వెళ్ళిపోతుంది. అది రెండో సింహం బ్రతికిఉన్నదా, చచ్చిపోయినదా అనికూడా వెనక్కి తిరిగిచూడదు. తర్వాత ఆ సింహాలజంట కొంతకాలం కలసి ఉండి సంతానం కలుగగానే రెండూ విడిపోతాయి. ఆ సంతానాన్ని పెంచి పెద్దచేసే బాధ్యత పూర్తిగా ఆడసింహం మీదే ఉంటుంది. పురుష కేసరి ఆ బాధ్యతనే వహించదు సరిగదా, అవకాశం చిక్కితే ఆ సంతానాన్ని సంహరించడానికే పొంచివుంటుంది. కోతుల్లోనూ, గొరిల్లాలలోనూ యీ అలవాటే కన్పిస్తుంది. ఇందువల్ల అలాంటి జాతులు ఎక్కువగా నాశనమైపోతాయి. అరణ్యాలే ఉండివుండకపోతే నేడు మనం వాటిపేరు వినడానికైనా అవి మిగిలివుండేవి కాదేమో! చాలాకాలంక్రిందటే ఆ జాతులు నశించిపోయి ఉండి ఉండవచ్చును.

ఈ సంఘటనను శ్రద్ధగా పరిశీలిస్తే ఒక విలక్షణమైన ఆత్మఘాతుకవృత్తి కనపడుతుంది. ఈ పశువులు తమ సంతానాభివృద్ధికిగాను, ప్రాకృతికమైన కామోద్రేకంవలననూ ఒకదానితో ఒకటి పోరి ప్రాణాలనైనా బలిపెడతాయిగాని, తమ అంతిమసఫలతగురించి ఆలోచించవు. అంటే సహజంగా తమ ప్రాణాలను బలిచేసే జంతువులు స్త్రీకోరకు, స్త్రీపొందుసౌఖ్యముల చెంత ప్రాణ సమర్పణ చెయ్యడంకాక తమను దహించివేస్తున్న కామాగ్నికే ఆహుతి అవుతున్నాయి. అందుచేత యిందులో ఏదైనా విలువఉన్నదీ అంటే అది దాని ప్రవృత్తివిలువేగాని స్త్రీయొక్క విలువకాదు. ఈ రెండు విషయాలను దృష్టిలో ఉంచుకుని మనం పశుప్రపంచాన్ని దాటి మానవసమాజాన్ని పరికిస్తే ఆవృత్తి ఇక్కడకూడా తప్పలేదనిపిస్తుంది. అంతేకాకుండా ఈ పశుప్రవృత్తిని ఎంతగొప్పగా పొగడి స్త్రీ పురుషుల ప్రేమస్థానాన్ని ఎంతస్వర్గమని చెప్పినా, యదార్థానికి అది సత్యంకాదు—ఒట్టి అభూతకల్పన.

ఇక్కడ రెండు ఉదాహరణలతో ఈ విషయాన్నే స్పష్టంచేస్తాము, అయితే ముందుగా ఒకవిషయం స్పష్టం చేయవలసియున్నది. వరుసగా ఒక క్రమపద్ధతిలో పెరుగుతూ వచ్చి వాల్మీకి, వ్యాస, కాళిదాసుల హృదయాలలో ఉత్పన్నమై విశ్వమంతటా ప్రతిబింబితమైన స్త్రీ పురుషుల మధ్యగల సహస్రముఖప్రేమ స్వర్గసుఖంకంటె ఏమాత్రం హీనమైనదికాదు. నీచకులంలో పుట్టినదని దాన్ని వుపేక్షించలేము గదా. కోహినూరును అదొక రాయిమాత్రమేననీ లేక వుపనిషద్విజ్ఞానాన్ని భూతప్రేతాల భయంవల్ల జనించినదనీ చెప్పి

వాటి అసలువిలువను తగ్గించడానికివీల్లేదు, ఇవన్నీ మాకూ తెలును. తెలుసును కనుకనే వీటిపుట్టుకను ప్రస్తావించితిమి. ఇందువల్లనే మేము ఆదిమయుగ చరిత్ర చూపిస్తూ నెమ్మదిగా దానివిలువ నేటికి ఎంతపెరిగిందో చూడమంటున్నాము. ఈ పశుప్రవృత్తి ఏవిధంగా ఒక అద్భుత అనిర్వచనీయ ప్రేమగానూ, పాతివ్రత్యంగానూ రూపొందినదో, ఏ విధంగా పురుషునిప్రవృత్తితో మొదట్లో నిర్ణయించబడ్డ స్త్రీ విలువ తదనంతరం భావుకులహృదయాల్లో దేవతల అమూల్య స్థానంలోకిపోయి పూరోచ్చగలిగిందో తెలుసుకోవాలంటే, ఇంకా ఆస్థానం దానికి ఉచితస్థానం అవునోకాదో నిర్ణయించాలన్నా మనం సాహసించి ఆదినుంచీ పరిశీలించడం మంచిది. "కళ్ళు మూసుకుని మా కేదితోస్తే అదేఅంటాం, మా యిష్టంవచ్చినట్లు శాస్త్రాలు తయారుచేస్తాం, మాకు తోచిన విలువలు కడతాం" అని భుజబలదర్పంతో విర్రవీగేవారు మాత్రమే అంటారు. కాని సత్యానికి న్యాయానికి కట్టుబడితే అలా వీల్లేదు. స్త్రీ విలువకు ఒక ప్రాకృతిక నియమం ఉంటుంది. ఆ నియమంకూడ ప్రపంచానికి మూలమైన అద్వితీయనియమానికి కట్టుబడిఉంటుంది. దాన్ని కృత్రిమంగా తగ్గించడం హెచ్చించడంవల్ల చివరకు ఏవిధమైన సత్ఫలితమూ రాదు. సేనరాజువల్ల కృత్రిమంగా కులీనులు గావించబడిన బెంగాలీ బ్రాహ్మణులకు తాత్కాలికంగా విలువపెరిగినా ఆ తర్వాత పెరూలోని ఇంకా జబర్దస్తీతోకూడిన ఆభిజాత్యం బెంగాలీ బ్రాహ్మణులను నాశనంచేసి ఊరుకున్నది. ఈ కఠోరసత్యాన్ని ఏ వ్యక్తిగాని, జాతిగాని తన సోమరితనం, అజ్ఞానం, మిథ్యాభి

మానాలవల్ల గుర్తించకపోతే ఆవ్యక్తి, ఆజాతి అనుదినం పతనంచెంది మృత్యుముఖంవేపుకే పోతున్నదనుకోవడానికి సందేహించ నవసరంలేదు.

ఆదిమ మానవసమాజంలోని రీతి రివాజులను పరిశీలిస్తే ఈ సత్యం మరింతస్పష్టంగా బోధపడగలదు. ఇంతవరకూ మనం నాగరికుల మనుకుంటున్న జాతులలో స్త్రీ విలువ ఎక్కడ నిర్ణయింపబడిందో నిరూపించుటకే ప్రయత్నించాము. యిక నాగరికత తెలియని అనాగరికజాతులు స్త్రీల కెట్టివిలువ నిచ్చారో చూద్దాం.

అమెరికాలోని అనాగరిక చిపివాయన్‌జాతి ప్రజలను గురించి హెర్బర్టు స్పెన్సర్ "తమకు అనురాగం ఏర్పడ్డ స్త్రీ కొరకు పురుషులు కుస్తీలు పట్టుకునేవారు" అని వ్రాశాడు. మంచిసంగతే. వీళ్ళనుగురించే వందసంవత్సరాల క్రితం హార్న్ దొర తన ఉత్తరమహాసముద్రయానం గురించిన పుస్తకంలో "ఈ జాతులవారు తన తల్లి-సవతితల్లే కాదు—కన్నతల్లి నైనా అందమైనదని తలిస్తే, ఆమెకొరకు వృద్ధుడగు తండ్రితోపోరాడి, తల్లిని బలవంతంగా లాక్కుపోయి పెండ్లి చేసుకునేవారు" అని వ్రాశాడు. వీళ్ళనుగురించి హెర్బర్టు స్పెన్సర్ తన Descriptive Sociology అనే గ్రంథంలో యిలా వ్రాశాడు—"చిపివాయన్ జాతిలో భర్త భార్యకు విడాకులివ్వడం అంటే భార్యను బాగా చితుకకొట్టి ఇంట్లోంచి తరిమివేయడమే. అంతకంటే విడాకులకు ప్రత్యేకంగా చెయ్యవలసిందేమీ ఉండేదికాదు. "ఆస్ట్రేలియా ఆదిమవాసులు ఏ

స్త్రీనైనా స్వాధీనంచేసుకోవాలంటే బల్లెములతో పోట్లాడుకునే వారట. అమెరికాలోని డగ్రివ్ జాతివారు దువ్వెలువలె పోట్లాడుకునేవారట. మంత్రజాతివారు సహజశత్రువుల్లాగా పోట్లాడుకునేవారట. డగ్రివ్ జాతివారు పశువులచే సామాను మోయించునట్లే స్త్రీలను ఉపయోగించుకునేవారట. మంత్ర జాతివారిలో ఒక్కొక్కడు తన జీవితంలో నలభై యాభై పెండ్లిండ్లు చేసుకునేవాడు. కాబట్టి అనాగరిక జాతులలో స్త్రీలను పొందడంకోసం యుద్ధాలు, అడవిజంతుస్వభావము వున్నట్లు తెలుస్తుంది. మళ్ళా ఆ స్త్రీలను త్యజించేరీతికూడా సరిగా వన్యపశువుల ప్రవృత్తినే పోలివుంటుంది. వీరికి స్త్రీ అంటే దమ్మిడీయెత్తు విలువకూడా లేదు. స్త్రీలుకూడా అలాగే ఉండేవారు. భర్త యుద్ధంలో బల్లెంపోటుతగిలి, క్రిందపడిపో గానే ఆ పతివ్రతా స్త్రీ తన సామానంతా నెత్తిన పెట్టుకుని విజేతను అనుసరించేది. అడవి జంతువులలోని ఆడమొగ సంబంధాన్ని మించిన సంపర్కమేమీ స్త్రీ - పురుషులలో వుండేదికాదు. ఒకరిపట్ల ఒకరికి ఏమాత్రం విలువలేదు.

ఉద్దాలకుని పుత్రుడు శ్వేతకేతు తనతల్లిని ఒకబ్రాహ్మ ణుడు బలవంతంగా తీసికొనిపోతూంటే చూచి, తండ్రిని 'ఈయన నాతల్లిని ఎక్కడికి తీసుకుపోతున్నారు?' అని ప్రశ్నిం చాడు. ఇదికూడా ఆ సమాజవ్యవస్థే. ఈ స్థితిలో స్త్రీ పురు షుని సంపత్తిగానే ఉండేది. ఇష్టమైనంతకాలం ఆమెను తనవద్ద ఉండనిచ్చేదీ, యిష్టంతప్పగానే వెళ్ళగొట్టేదీను. ఇక ఆమె ఎక్కడబ్రతికినా, బ్రతకలేక చచ్చిపోయినా సరే.

దీని తర్వాతదశ పలనేషియా, న్యూ క్యాలిడోనియా ఫిజీ ద్వీపాలలోని అనాగరికజాతుల్లో కనిపిస్తుంది. తమకు నచ్చిన స్త్రీకొరకు వీరు యుద్ధాలుచేసి అపాయకర పరిస్థితు లలో కూడా ప్రాణాలను లెక్క చేయక ఆ స్త్రీని తమయింటికి తీసుకుపోయేవారు. కాని ఆమెయందలి వ్యామోహం తీరినా ఆమెను వెళ్ళగొట్టక, చంపి ఆ మాంసాన్ని వండుకుతినే వారని అడ్మిరల్ ఫిట్జ్రాయ్, హన్‌బోల్ట్, విల్కిన్ మొదలైన వారు వ్రాశారు.

ఆ తర్వాతస్థితి స్త్రీని ఆస్తిగా ఎంచినప్పటిస్థితి. హెర్బర్టు స్పెన్సర్ తన సాంఘికశాస్త్రసిద్ధాంతాలు అనే పుస్తకంలో యిలా వ్రాశాడు. "హార్న్ దొరతో ఒకసారి ఒక చిపివాయన్ నాయకుడు యిలాఅన్నాడు — స్త్రీలు పని చెయ్యడానికిమాత్రమే సృష్టించబడ్డారు. ఇద్దరు పురుషులు మోసేంత బరువు ఒక్క స్త్రీ మోస్తుంది" అని. ఆ పుస్తకంలో బైరో గారి Interior of South Africa అనే పుస్తకంలో ఒక చోట ఇలా ఉదహరించారు—"ఒక కాఫిర్ నాతో స్త్రీ తన భర్తయొక్క 'యెద్దు' అని చెప్పాడు. స్త్రీలు కొనుక్కోబడతారు కనుక వాళ్ళపని పరిశ్రమచేయడమేనని అతను సమర్థించాడు" సూటర్‌దొర యిలా వ్రాశాడు: ఒక కాఫిర్ తన భార్యను చంపి ఆమెను తాను శాశ్వతంగా కొనుక్కున్నాడు కనుకనే తాను చంపివేశానని సమర్థించుకుంటాడు."

అనాగరిక మపుచీజాతిలో యింతకంటె కొద్దిఔన్నత్యం కనబడుతుంది. వాళ్ళనుగురించి ఇలా చెప్పబడింది—"మపుచీ స్త్రీ వితంతువు కాగానే ఆమెకు సవతికొడుకు లేకపోతే ఆమె

సర్వస్వతంత్రురాలు అవుతుంది. కాని ఆమెకు సవతికొడుకులు వుంటే ఈమె వారందరికి భూమి - పుత్రవలె ఉమ్మడి ఆస్తిగా పరిగణింపబడుతుంది. ఆమెపై వారందరికి సమానాధికారం వుంటుంది." ప్రపంచంలో చాలా జాతుల్లో స్త్రీ జాతి స్థితి యిదే.

క్రైస్తవుల బైబిలు పాతనిబంధనలలో లేవీ తన విధవ కోడలిని యితరులకు అమ్మినట్లు ఉన్నది. మన శాస్త్రాల్లో కూడ కన్యతండ్రి తానుపొందిన కన్యాశుల్కమును తిరిగి ముట్ట చెప్పలేకపోతే వితంతువైన తన కూతురు అత్తవారి అధికారమునకు లోబడివుండాలని చెప్పబడింది. ఇలాంటి నియమాలన్నీ ఆ స్త్రీవంపిణీ పద్ధతిలోనే ఉన్నాయి. వేరాపాజ్ ఆదిమనివాసులనుగురించి ఇలా వ్రాయబడింది—"చనిపోయినవ్యక్తి సోదరుడు తాను వివాహితుడైనాసరే, వదినెనుగాని మరదలినిగాని వెంటనే ఆలస్యంచెయ్యకుండా తన భార్యగా చేసుకునేవాడు. ఒకవేళ అతను ఆమెను తన భార్యగా స్వీకరించకపోతే మరేబంధువైనా ఆమెను తనదిగా చేసుకోవచ్చు." అంటే దానిఅర్థం ఆ స్త్రీ చెయిజాటిపోకూడదనే కదా! ప్రపంచంలో నూటికి తొంభైజాతులవిషయంలో పై కథనంలోని ప్రతి అక్షరం యదార్థమే.

History of Woman's Suffrage అనే పుస్తకంలోంచి కొన్నివాక్యాలు చూపి అమెరికాలో బోస్టన్‌వంటి చోట 1850 వరకూ కూడా స్త్రీకి ఎలాంటిస్థానం ఉండేదో చూపుతాము. పై గ్రంథంలో స్త్రీ వివాహానికి పూర్వమే తన

ఆస్తినంతా భర్తపేర వ్రాసేస్తుందనీ, "ఆమె ఒకవ్యక్తిగా ఉండేదికాదు", "ఇంట్లో పనిచేసే నౌకరుకంటె కొంచెం మిన్నగా ఉండేది". "ఇంగ్లీషువారి సాధారణ న్యాయం ప్రకారం ఆమెభర్తయే ఆమెకు ప్రభువు, యజమానీని", "భర్త ఆమెను కర్రలతో కొట్టుకోవచ్చు" "మైసేచుసెట్సు అనే రాజ్యంలో భార్యాభర్తలు ఒకేవ్యక్తిగా భావింపబడి, ఆ వ్యక్తి భర్త మాత్రమే గుర్తింపబడేవాడు." "స్త్రీకి ప్రత్యేకవ్యక్తిగత అధికారాలేమీ ఉండేవికాదు ఆమె తన ఆత్మనుకూడా తనది అని అనలేకపోయేది." అని అన్నది. మరి నేటి అమెరికాలో స్త్రీ సమాజానికున్న ఆశ్చర్యకర స్వాతంత్ర్యాన్ని గురించి ఎన్నెన్ని వింటున్నాం! కాని ఆనాడు మనదేశంలోవలెనే స్త్రీలను చావమోదడం, మొరపెట్టుకున్నా వినేనాథుడే లేకపోవడంగా ఉండేది అక్కడాను!

అయితే మనకొక సందేహం కలుగుతుంది. ప్రపంచంలో మొట్టమొదట పురుషుడు స్త్రీపై అత్యాచారాలను ఏదశలో ప్రారంభించాడా అని. మనిషి పశువుగా వున్నప్పటి నుంచే వున్నదా? లేక కొంత నాగరికత పొందినతర్వాత ఈ అత్యాచారాలు ప్రారంభించాడా? దీనివిషయమై ఏ సామాజిక తత్వవేత్తకూడా నిశ్చయంగా ఏమీ చెప్పలేదు. విషయం కూడ అలాంటిదే. ఎందుకంటే ప్రపంచంలో మొదటినుంచీ కూడ అనాగరికజాతులైనా లేక నాగరికతపొందిన జాతులైనాకూడ వాటిలో స్త్రీ పురుషుల సంబంధాలు చాలా జటిలంగాను, రహస్యంగానూ వుండడంచేత బయటివారు బయటినుండి చూచి ఏమీ చెప్పలేకపోయేవారు. లేటూర్ ద్వార

ఆదిమజాతుల్లో పురుషులు స్త్రీలను విపరీతంగా బాధలుపెట్టా రనీ, అంతగా సురెవ్వుతూ, ఎక్కడా, ఎవరూ స్త్రీలను బాధించలేదని తొలిసారిగా చెప్పినప్పుడు, ఆయన తన బుద్ధిబలం మీద ఆధారపడే చెప్పారు. దాన్ని చాలామంది విశ్వసించారు కూడాను. కాని నేడు మరికొంతమంది పండితులు దానిపై పరిశోధన ప్రారంభించి లేటూర్ గారికథనాన్ని అంగీకరించడం లేదు. ఎందుకంటే స్త్రీ పురుషుల సంబంధంలో సహజంగా అలా వుండడానికే వీల్లేదని విపరీతమైన అత్యాచారాలను సలిపి క్రూరంగానూ ఊహించలేనంత నిర్దాక్షిణ్యంగాను వ్యవహరించేవారు" అనే వాదాన్ని సమర్థించలేకపోతున్నారు. ఇదే జరిగివుంటే ప్రపంచంలో మానవజాతియే నశించిపోయివుండేది. మన ఆలోచన లన్నిటా ఈ సత్యాన్ని దృష్టిపథంలో వుంచుకొనకపోతే చాలా తప్పిదం కాగలదు. అయితే వారు చెప్పే దాంట్లో ముప్పాతికపాలు నిజం వుండవచ్చుననడానికీ సందేహంలేదు.

హెడ్డన్‌దొర తన Hed Hunters అనే పుస్తకంలో "స్త్రీలు వివిధంగా అణగద్రొక్కబడేవారూకాదు, వారిని అనాగరికంగా ఉపయోగించేవారూ కాదు" అని వ్రాసిన విషయంకూడా నిజంకాదు. అయితే కొన్ని ఆదిమజాతుల్లో ఇందుకు అనుకూలమగు ఉదాహరణలుకూడా దొరక్కపోవు. ఉదాహరణకు భారతదేశంలోని ఖసియా జాతిలో భార్యకు కోపంవస్తే భర్తను యింట్లోంచి వెళ్ళగొట్టి రెండోపెళ్ళి చేసుకునేది. నికారావా, టాహిటీ జాతుల్లోకూడా ఇలా

జరిగేది. ఆపాచజాతివారు యుద్ధంలో ఓడిపోయి యింటికి తిరిగివస్తే స్త్రీలు వారిని యింట్లో అడుగుపెట్టనిచ్చేవారు కాదట. డాయేక్, అమెజాన్‌లు యుద్ధంలో పరాక్రమం చూపకపోతే వివాహానికి అనర్హులయ్యేవారు. నరమాంసాహారులగు కారిబ్ జాతి ప్రజలు పురుషులమాంసాన్ని తినేవారు గాని, స్త్రీల మాంసమును ముట్టేవారుకాదు. అరబ్ దేశంలో షేక్ యువతులఎదుట కొరడాదెబ్బలను సహించలేని యువకులు యువతుల హృదయాలను వశపరచుకోలేకపోయే వారు. యింతేకాక ఇంకా చాలాంజాతుల్లో ఉదాహరణకు సుమత్రాలోని బాతాప్రదేశంలో, ఆఫ్రికాలోని స్వర్ణవనపు నీగ్రోలలో, అమెరికాలోని పెరూదేశ అనాగరిక జాతులలో ఇంకా అనేక ఆదిమజాతుల్లో బహుశః మనదేశంలోని టోడా జాతిలోకూడ వారసత్వపుహక్కు ఆడవారికే ఉండేది కాని, పురుషులకు కాదు.

ఇవన్నీ యిలా వున్నప్పటికీ వేలకొద్ది వుదాహరణలిచ్చి స్త్రీలను చిరకాలంనించీ బాధిస్తూవచ్చారని నిరూపించవచ్చు. యింతకుముందు స్త్రీలను ఆస్తిగా పరిగణించేవారని చెప్పాను. అలాగనే ఆస్తివారసత్వంకూడ స్త్రీలనుంచే ప్రారంభమై నట్టుంది, ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క స్త్రీ పంపకంలో ఐదారుచేతుల్లోకి మారుతూఉండేది. అందుచేత ఆమెగర్భం నుండి జనించిన సంతానం ఏ వంశానికి చెందినదో నిర్ణయించ టానికి వీలుండేదికాదు. అందుకనే ఏ పురుషుడైనా చనిపోతే అతని ఆస్తి అతని భార్యకుకాక చెల్లెలి సంతానానికి సంక్ర

మించేది. ఆ చెల్లెలు చేతులుమారేది కాదని కాదు అర్థం. కాని ఎంతైనా ఆమె తమవంశానికి చెందినదనీ, అందుచేత ఆమెపిల్లల్లో తమ వంశరక్తం ఉంటుందనీ భావించేవారు. అందుచేతనే ఆ ఆస్తి మేనల్లుడికి దక్కేది కాని కుమారుడికి లభించేదికాదు. ఆ ఆస్తి ఎవరికిదక్కినా, వారసులను పురుషులే నిర్ణయించేవారు. అందులో స్త్రీలకేమీ స్థానం ఉండేదికాదు. మానవుని బుద్ధిభేదాలవల్ల గోరెమెడను ఎడంవేపునుంచి నరికినా లేక కుడివేపునుంచి నరికినా పర్యవసానం ఒకటే. బహుశః అందుచేతనేమో టైలర్ దొర స్వర్ణవనపు నీగ్రోలనుగురించి వ్రాస్తూ స్త్రీలకు కొన్ని అధికారాలున్నట్లు పైకి కనపడినా, యదార్థంలో వారు చాలా అణగారిఉన్నారన్నాడు. ఇదేస్థితి అన్ని జాతుల్లోనూ ఉంది.

క్రాలేదొర తన క్రొత్తపుస్తకం 'Mystic Rose' లో స్త్రీల ఔన్నత్యాన్నిగురించి వ్రాస్తూ పాపువన్ ప్రజలను గూర్చి ఉదహరించారు. వీరు స్త్రీలను అతిగా బాధపెట్టడంలో పేరుపొందినా వివాహవిషయంలోమాత్రం స్త్రీయే తనభర్తను ఎంచుకుంటుందనీ, పురుషుడు తనకుతానై ఏ స్త్రీని వివాహమాడుతానని అనుకూడదనీ, స్త్రీయే ముందుగా పురుషుణ్ణి కోరాలనీ ఈరీతివల్లనే ఆజాతి ఔన్నత్యంపొందినదనీ వ్రాశారు. పైకి ఈ పద్ధతిలో లోపంలేనట్లు కనిపించినా, ఇందుకు వ్యతిరేకంగా ఎన్నని చెప్పవచ్చు. మొదటివిషయం: వారు స్వయంగా భర్తను ఎన్నుకున్నంతమాత్రాన పురుషులు వారిని బాధించరనే నిశ్చయంలేదు. దాంపత్యప్రేమ అంటేనే ఏమీ తెలియని వారు, మాటమాటకీ స్త్రీలను హత్యచేసేజాతిలో స్త్రీలకు

ఏదోఒక చిన్న అవకాశ మేర్పడినసంటే దానివల్ల వాళ్ళకేం లాభం జరిగిందో మాకేమీ అర్థంకాదు.

రెవరెండు సూటర్ ద్వార ఉత్తరాఫ్రికాలోని కాంగో, ఉగండా ప్రదేశాలలో స్త్రీలకు గౌరవమర్యాద లున్నాయని అంటారు. నిజానికి ఆ దేశాల్లో స్త్రీలు రాణులుగా గద్దెలెక్కుతారు. అయితే కెప్టెన్ స్పీక్ ద్వార తన "నైలునది జన్మస్థాన అన్వేషణ" అనే గ్రంథంలో ఆదేశాలలో ఏ తప్పూ లేకుండానే పురుషులు స్త్రీలను హత్యచేస్తారని వ్రాశారు. ఆయన యిలాంటి సంఘటనలచిత్రాలను తన పుస్తకంలో వేశారు. ఆయన యింకా యిల్లా వ్రాశారు—" స్త్రీల చేతులను త్రాళ్ళతో కట్టి వధ్యస్థలానికి ఈడ్చుకుపోతూఉంటే వాళ్ళు సెక్కివెక్కి ఏడుస్తారు. ఆ ఏడుపువింటే దయ్యాలకుకూడా దయకలుగు తుందేమోగాని ఆ దేశపురుషులకు మాత్రం జాలి కలుగదు." ఆ రచయిత గుడారంలోకి వినపడేటట్లు సమీపమార్గంగుండా తీసుకొనిపోబడే ఒక స్త్రీ 'హే నియాంగే!' 'హే బాకా!' (నా స్వామీ, నా రాజా) అని అరుస్తూఉంటే ఆమెభర్త ఆ అరుపులు సంతోషంగా విన్నాడట. ఆ దేశపురాజు నేరా మరణానంతరం జరిగిన కొన్నిఘటనలను కెప్టెన్ స్పీక్ తన కళ్ళతోచూచి, ఆ దృశ్యాలను వర్ణించాడు. వాటిని చదివితే పిల్లలకు మట్టిబొమ్మలంటే ఉండే విలువకూడా స్త్రీలంటే ఆ దేశంలో పురుషులకు లేదనిపిస్తుంది. ఒకచోట యిలా వ్రాశారు—చనిపోయిన తండ్రికుమారెలెందర్ని రాజకుమారుడు వివాహమాడి, వివాహంజరిగి వారం అయ్యాక తాత

మునుపే ఉండుంలో ముగ్గుర్ని సరిగా అభివాద మాచరించ లేదని పిలువుగా కాల్చివేశాడట'

చాలమంది యాత్రీకులు ఆదిమజాతులవారికి భార్యాభర్తల ప్రేమ అన్నమాటైనా తెలియదని వ్రాశారు. మాంటేరో అనే ఆయన "స్త్రీలలో ప్రేమ, అనురాగం, ఈర్ష్య అనే గుణాలకే ఎరుగరు. వారిభాషలో వీటిని వ్యక్తంచేసే పదాలే లేవు" అని వ్రాశారు. సర్ జాన్ లబక్ అనే ఆయన ఆ దేశంలోని హాటెన్‌టాట్ జాతినిగురించి వ్రాస్తూ "ఆ దేశస్థులు పరస్పరసంబంధమేలేని నిర్మోహులుగా ఉంటారు. వారి ప్రవర్తన చూస్తే వీళ్ళల్లో ప్రేమ అనే భావం మచ్చుకైనా లేదనిపిస్తుంది" అని వ్రాశారు. కాఫిర్ జాతినిగురించి వారి వివాహవ్యవస్థలో అనురాగం ఎక్కడా లే దంటారు. జాకెబ్ జాతిలో స్త్రీ పురుషులమధ్య ప్రేమ ప్రసక్తేఉండదట. అలాగని వీళ్ళల్లో స్త్రీ పతిసేవ చేయడం. పురుషుడు భార్యను ప్రేమించడమే లేదనికాదు. కాని పురుషుల జబర్దస్తీవల్లనే హామన్. మూల్గాసీ, ఫిజియన్, ఛీనా, బేసుటాలు జాతుల్లో పతివ్రతలు కన్పిస్తారు. హామన్ ఫిజీద్వీపాల్లో భర్త మరణానంతరం స్త్రీలు ఆత్మహత్య చేసుకుంటారని యింతకుముందే చెప్పాము. అమెరికాలోని మండాన్ జాతి వితంతువులు తమ మృతభర్తల కపాలాలను పంచగా గుచ్చి మెడను ధరించేవారట. అంతేకాకుండా రాత్రిళ్ళు వాటిని తమ ప్రక్కలో పెట్టుకొని పడుకొనేవారట. వాటిని స్నానం చేయించేవారు. చలికాలంలో తమ కొంగుల క్రింద పెట్టుకొనేవారట. నిద్రించేటప్పుడు రాత్రిళ్లు వాటిని నిద్ర

పుచ్చడానికని జోలపాటలు పాడేవారట. మరి ఆ పురుషులు తను జీవితకాలంలో ఆమెతో ఎలా వ్యవహరించారో! అలాగని అన్ని సందర్భాలలోనూ పురుషులు అత్యాచారాలే చేస్తూ వచ్చారనీ, అందుకు బదులుగా స్త్రీలు ఎప్పుడూ ప్రేమించి సేవచేస్తూ వచ్చారనీ మే మనడంలేదు. బహుశః మేము అలా అంటే మానవస్వభావానికి విరుద్ధమైన మాట చెప్పడమే. అయినా క్రూరఅత్యాచారాలు, బాధలకు బదులుగా ఎక్కడైనా ప్రేమ, సేవచేయడం జరుగుతుందీ అంటే అది ఒక్క స్త్రీలలోనేనని చెప్పకతప్పదు. దీనికి ఉదాహరణలు చూసా లంటే అసభ్య ఆదిసమాజంలో కూడా దొరుకుతాయి. అందు కనే పైన ఒకటిరెండు ఉదాహరణ లివ్వడం జరిగింది.

స్త్రీకున్న యీ విలువను పురుషుడు అంగీకరించడు. అంగీకరించగోరడని తెలుపుటకే ప్రయత్నించాము. అయితే దీనికి వ్యతిరేకంగా కూడా కావలసినంత చెప్పవచ్చు. ఒకవేళ వాటినన్నిటినీ అంగీకరించినా ఈ పుస్తకం ప్రధానోద్దేశం లేశమైనా చలించదు.

ఏదిఏమైనా, యింతవరకూ ఏ దేశంలోనూకూడా ఏ పురుషుడు స్త్రీకి యథార్థవిలువను ఇవ్వలేదనీ, పురుషుడెప్పుడూ స్త్రీని ఎన్నోవిధాల హింసించాడనీ చెప్పాము. పురుషుడు స్త్రీని బాధించాడనే విషయం అంగీకరించక తప్పదు. అయితే స్త్రీయొక్క న్యాయమైన హక్కులనుండి ఆమెను ఎప్పుడూ వంచిస్తూవచ్చాడనే విషయంమీద చర్చ జరుగ వచ్చు. అసలు స్త్రీయొక్క యథార్థవిలువ ఏమిటో నిర్ణ

యించకుండానే ఆమెకు ఆ విలువ లభించిందో లేదో యెలా చెప్పగలమని పురుషుడు అనవచ్చు. ఏ ఏ దేశాల్లో స్త్రీలు ఎంత విలువపొందుతూవచ్చారో అదే వారి యదార్థమైన విలువ అనికూడా పురుషుడు అనవచ్చు.

దీన్ని పరిశీలించాలంటే ముందుగా స్త్రీ పురుషుల సంబంధాన్నిగూర్చి తెలుసుకోవాలి. స్త్రీ పురుషులమధ్య ముఖ్యంగా నాలుగురకాల సంబంధాలు ఉంటాయి. అవి భార్య, చెల్లెలు, కూతురు, తల్లి సంబంధాలు. ఇప్పుడువరుసగా ఈసంబంధాలనే పరిశీలిద్దాము జాన్. ఎఫ్. యం. లెనన్ అనేక దేశాల ఉదాహరణలిస్తూ తన Primitive Marriage అనే పుస్తకంలో ఆదిమజాతి ప్రజలు భార్యను ఎలా పొందేవారో వివరించాడు. మనుష్యులు పశుతుల్యులుగా సంచరించేటప్పుడు పురుషుడు స్త్రీని ఎలా పొందేవాడో ఈ పుస్తకం ఆరంభంలో అనేకసాక్ష్యు ఉదహరించాము. బలవంతుడు బలహీనునినుండి స్త్రీని లాక్కునేవాడు. తన మోహం తీరగానే ఆమెను వదలి వేస్తూఉండేవాడు. తన కామం, మోహం తప్ప మరేమీ అత డాలోచించేవాడు కాదు. స్త్రీతోడి యే సంబంధమూ అతన్ని బాధించేదికాదు. యం, లెనన్ ఒకచోట "పూర్వ కాలంలో వివాహసమయంలో స్త్రీ పురుషులమధ్య ఎలాంటి సంబంధం ఉన్నా లెక్కలోకి వచ్చేదికాదు" అని వ్రాశాడు. ఆయన వ్రాసినది చాలవరకు సత్యమే. ఎందుకంటే ఆరోజులలో ప్రాథమిక ప్రాకృతికజ్ఞానం అనేది ఉండేదికాదు.

కేవలం అనాగరికఆదిమ జాతుల్లోనే తల్లి, చెల్లెలు, కూతురు అనే విచక్షణలేక వివాహమాడడమేకాక, అర్ధనాగరిక,

నాగరికజాతుల్లోకూడ ఇందుకు తగిన ఉదాహరణ లెన్నో కనబడతాయి. వంశపారంపర్యతను గురించి పరిశోధించేవారికి నాగరికజాతుల్లోకూడా మధ్యమధ్య కనబడే భీభత్స రహస్య కళంక సంబంధాలు ఆ ఆదిమజాతుల సంబంధాలవంటివే నని తెలుసు.

అనాగరిక ఫీజివాయన్ పురుషులు తమ తల్లిని వివాహమాడేవారని చెప్పాము. ఇటీవలి ఉదాహరణ : అర్ధనాగరికులైన ఆఫ్రికాలోని గేబూన్ ప్రదేశంలో భర్త చనిపోగానే రాజ్యం పోతుందనే ఉద్దేశ్యంతో రాణి తన పెద్దకొడుకునే వివాహమాడి సింహాసనాన్ని దక్కించుకుంది. నాగరికులైన ఈజిప్టులోని ఫరావో(రాజు)లు తమ తోబుట్టువులనే వివాహమాడేవారు. నాగరిక పెరూ దేశంలో రోకా, ఇంకా వంశంలోని ఆరవయింకాయో ఏడవయింకాయో తన ఆభిజాత్యాన్ని నిలుపుటకు తన ద్వితీయపుత్రునకు కనిష్టపుత్రికను వివాహం చేసి, వారిని సింహాసన మెక్కించాడు. వశిష్ఠమునికూడా తన సోదరి అరుంధతిని వివాహమాడాడు. సింహళద్వీపంలోని భేద్దాజాతివారు కనిష్ఠసోదరిని వివాహమాడడం ఎంతో గౌరవప్రదంగా భావించేవారు. అప్పట్లో అలాంటివారు తమ సమాజంలో కులీనులుగా భావింపబడి. అధికగౌరవానికి పాత్రులయ్యేవారు. సవతితల్లి కూతురు, విధవ వదినెలతో వివాహసంబంధాలు అనేక దేశాల్లో ఉన్నాయి. వీళ్ళల్లో ఒక్క భేద్దాజాతివారుతప్ప మరేజాతివారూ ఒక స్త్రీతో సంతృప్తి చెందేవారు కాదు. అంటే నాటి పురుషులు తమ

గృహిణిని యితరులకిచ్చేవారు కారు గాని, ఇతరుల స్త్రీలను లాక్కుపోయేవారు.

పైన చెప్పిన విషయాలు ఆ దేశాలవరకే పరిమితమై యితర దేశాలకు వర్తించవనుకోవటం పొరబాటు. అన్ని జాతు లోనూ, అన్ని దేశాల్లోనూ యివి ఉన్నాయి. అయితే, తేడా ఏమిటంటే కొన్ని చోట్ల కాలగర్భంలో లీనమైపోయాయి. మన దేశంలో 'నేడు అన్నగారు తమ్ముని భార్యనీ కనుకూడా తాక కూడదు; కాని ఈ దేశంలోనే ఒకప్పుడు పంచపాండవులు ద్రౌపది నొక్కదానినే వివాహమాడారు. సరిగా గుర్తులేదు, కాని సప్తమహర్షులు ఏడుగురూ అన్నదమ్ములే అవుతారు. ఒకే స్త్రీతో తమ ఋషియాత్రను నిర్వహించారు. ఇదే భారతంలోని ఆదిపర్వంలో సహాతనాచారముని చెప్పబడింది. బల వంతంగా పెళ్ళిచేసుకోవడమనేది ఆదిమజాతుల్లోనే కాదు, అది భారతదేశంలో చాలా ఎక్కువగా ఉండేది. అందుకు ఉదాహరణల కేమీ లోటులేదు.

స్త్రీలనుగురించి యిటూ బయటాకూడా తగాదాలు, తన్నులాటలు జరుగుతాయి. మరి రెండురోజులు పోతే, ఆ స్త్రీలకు విలువేఉండదు. ఈ విషయాన్ని స్పష్టంచెయ్యడానికే స్త్రీల ఆదిమవ్యవస్థను వివరించవలసివచ్చింది 1870 వరకూ అబిస్సీనియాలో ఒక ఆచారం ఉండేది. ఎవరికైనా మరణదండన విధింపబడితే ఆ వ్యక్తి తన తలకుబదులు, తమ సర్దారుకు యవ్వనవతియగు కూతురునుగాని, భార్యనుగాని సమర్పించే వాడు. రెండురోజుల అనంతరం తనకు లభించిన ఈ బహుమానాన్ని తన కిష్టమైనవానికి ఇచ్చేసేవాడు. కెప్టెన్ స్పీక్

అబిసీనియా రాజుకు సంబంధించిన ఒక సంఘటనను యిలా వర్ణించాడు—"...ఆ తర్వాత రాజు, రాణులు అందరూ తోటలో చెట్ల క్రింద క్రీడిస్తూ ఉల్లాసంగా వున్నారు. దురదృష్టవశాత్తూ రాణులలోకల్లా అతిసుందరియైన రాణి ఒకపండుకోసి రాజుకు యివ్వబోయింది. అందువల్ల రాజు తనను అభినందిస్తాడనుకున్నది. కాని రాజు వెంటనే కోపోద్రిక్తుడై పిచ్చివానిలా తన్నుతాను మరచిపోయి "యింతవరకూ నాకు ఆడది బహుమానమివ్వాలని ప్రయత్నించే పెంకితనానికి ఇదే ప్రథమం" అంటూ ఆమెను వెంటనే బంధించి ఉరికంబ మెక్కించమని తన ప్రక్కనున్న భటుల కాజ్ఞాపించాడు. తర్వాత స్పెక్ యిలా వ్రాశాడు—"నా ఆంగ్ల రక్తానికి యీ సంఘటన సహించరానిది. అందుచేత నేను నా ప్రాణానికి తెగించి ఆ ఉన్మత్తరాజు వుద్దేశ్యాన్ని విఫలంచేయ ప్రయత్నించి, తుదకా స్త్రీ ప్రాణాలను కాపాడగలిగాను."

స్త్రీలయెడల పురుషుల ఈలీలలు, స్వార్థపరత్వం, క్రూరస్వభావం, పిచ్చితనం స్త్రీ జాతినే అవమానించి, అణగద్రొక్కి సంతృప్తిపడక పురుష సమాజాన్ని, మాతృభూమినీ కూడా పతనంచేశాయి. దీనినిగురించి వివిధదేశాల ఉదాహరణలిచ్చి స్పష్టంచెయ్యాలంటే ఇందులో స్థలంచాలదు. అందుచేత కెప్టెన్ స్పెక్ రచననుండే మరొక ఉదాహరణ ఇచ్చి ఈ విషయాన్ని ముగిస్తాము. ఆఫ్రికాలోని ఈ దుర్దశకు పురుషుల విశృంఖలత్వమే ముఖ్యాతికవంతు కారణం. అక్కడ ఏ గౌరవనీయుడగు పెద్దవాడో చనిపోతే పెద్ద యుద్ధరంగం తయారయ్యేది. ఎందుకంటే ఎవరు ఎవరిసవతి సోదరు

డవునో కాదో, ఎవరి ఆస్తి (స్త్రీలు) ఎవరికి చెందాలో ఎవరికి చెందకూడదో తేల్చుకోవాలంటే భుజబల ప్రదర్శనం, బల్లేల యుద్ధం తప్ప వేరుమార్గం ఉండేదికాదు.

మరొక విషయం. పై కెప్టెన్‌గారే ఒకసారి ఆయన తన నీగ్రోనౌకరు బావింబీ నోట తాము మనిషిమాంసం తింటామని, మనిషిమాంసం చాలారుచిగా ఉంటుందనీ విన్నాడట. అప్పుడు కెప్టెన్‌గారు 'ఇంతమాంసం ఎలా దొరుకుతుంది? మీవాళ్ళనే చంపుకుతింటారా?' అని అడిగారట దానికి సమాధానంగా కాదనీ, ప్రక్కగ్రామాలనుండి మనుష్యులను కొనుక్కువస్తామనీ చెప్పాడట. 'అదెలాగ' అని కెప్టెన్ అడిగాడట. తండ్రిలేని పిల్లలకు తినడానికేమీ దొరక్క, వారు నీరసించిపోయేవారనీ, ఆ స్థితిలో వాళ్ళతల్లికి ఒక్క మేకనుయిస్తేనే ఒకబిడ్డను అమ్మివేసేదనీ, అలాంటివాళ్ళను కొనుక్కుని తింటామనీ నౌకరు చెప్పాడట. నాగరిక దేశాలలో తండ్రి రెండోపెళ్ళి చేసుకున్నతర్వాత, రెండవభార్య పిల్లలతో పోలిస్తే మొదటిభార్యపిల్లలపట్ల నిర్దయుడౌతాడు. అలాగే ఒక భర్తనువొదిలి, మరొకపురుషుని చేపట్టిన స్త్రీకి కూడా మొదటిభర్తసంతానమంటే నిర్లక్ష్యం కల్గడం సహజం కావొచ్చు. అది అనాగరికులైనందున వారిలో మరికొంత అధికమై ఉండవచ్చు.

అండమాన్ దీవులలోని ఆదిమజాతుల్లో ఒక అలవాటు ఉన్నది. పిల్లలకు పళ్ళురానంతవరకే స్త్రీ పురుషులు కలిసి ఉంటారట; పిల్లలకు పళ్ళురాగానే ఇద్దరూ విడిపోతారట. పురుషుడు మరొక స్త్రీని, స్త్రీ మరొక పురుషుణ్ణి వెతు

కున్నంటారు. అలాంటప్పుడు సాధారణంగా స్త్రీ తన ఆ సంతానాన్ని ఏ చెట్టుపైనో వదిలిపెట్టేసి తన క్రొత్తసంసారాన్ని చక్కబెట్టుకోవడంలో నిమగ్నురాలవుతుందట. అందువల్లనే అండమాన్ ఆదిమజాతి చాలా త్వరగా నశించిపోతున్నదని ఫ్రాన్సిస్‌డే తన రిపోర్టులో పేర్కొన్నాడు. ఆయనను ఎంత వెదకినా ముగ్గురుబిడ్డల్ని సజీవంగా ఉంచుకున్న తల్లే కనబడలేదట!

అమెరికాలోని కుచిల్‌జాతివారు తమ సంతానం రోగగ్రస్తమైనప్పుడు అడవుల్లోకి తీసుకువెళ్ళి పారేస్తారట ఆస్ట్రేలియాలోని ఆదిమవాసులు సజీవంగాయున్న తమపిల్లలను మొసళ్ళను, పెద్ద చేపలను పట్టడానికి గాలానికి తగిలించి ఎరగా వేసేవారని అంగాన్ వ్రాశారు. అది నమ్మశక్యంకాదని హెర్బర్ట్ స్పెన్సర్ తన పుస్తకంలో విమర్శించారు. కాని అంగాన్ కథనం నమ్మవీలులేనిదికాదు ఎందుకంటే ఏ జాతిలోగాని, ఏ దేశంలోగాని స్త్రీ విలువ పడిపోయినప్పుడు, ఆ సమాజంలోని బిడ్డలస్థానంకూడా పడిపోతుందనేవిషయం పరిశోధనవల్ల తెలుస్తోంది. ఇది కేవలం నిమ్నస్థాయికిచెందిన మానవుల సంగతిమాత్రమేకాదు. ఉన్నతతరగతిలోకూడా స్త్రీకి స్థానం పడిపోయినప్పుడు శిశువులస్థానమూ పడిపోతూవచ్చింది. దీనికి ఉదాహరణలు అనవసరం. కాని, ఆ జాతుల భవిష్యత్తు మాత్రం అంధకారబంధురమైపోతుంది. ఇందుకు స్త్రీ పురుషుల సంబంధాలే కారణమనుకునేవారు పొరబడుతున్నారనవలసివస్తుంది. దీనికి ముఖ్యకారణం స్త్రీ ఉపేక్షింపబడటము, ఆమె ఒక ఆటవస్తువుగామాత్రమే పరిగణింపబడడమూను.

హెర్బర్ట్ స్పెన్సరు తన సాంఘిక శాస్త్రంలో మానవుని తీవ్రమానసిక భావాలను ఎత్తిచూపి, దీనినిగురించి ప్రస్తావించినట్లు జ్ఞాపకం. కోపంలో ఉన్నసమయంలో పిల్లలు ఏదైనా పొరపాటు చేస్తే వారిని కొట్టడం సాధారణంగా జరుగుతూంటుంది. ఇది ఉద్రిక్తమనోవికార పరిణామం అంటారు. అయితే ఒక్కొక్కప్పుడు ఏ చింతా - చీకూ లేకుండా ఆదిమజాతులు తమ పిల్లల్ని చంపివేసేవారనికూడ అంటారు. చేపలుపట్టుటకు ఎరగా ఉపయోగించుటకు పిల్లల్ని చంపడం, రోగగ్రస్థులగు పిల్లల్ని అడవిపాలుచేయడం—ఇలాంటివి ఎలా తీవ్ర మనోవికార పరిణామంవల్ల సంభవించేవి కాగలవో తెలియదు. ఒకవేళ ఇవన్నీ మనోవికారాల పరిణామఫలితాలే అనుకున్నామా వాదనాబలమేమీ తగ్గదు. ఆదిమజాతులమధ్యఉండే దోషాలు ఉండేవే; స్త్రీ పురుషులమధ్య సంభంధాలు కూడా శిథిలమైనవన్నదీ యదార్థమే. యివన్నీ యిలా ఉన్నప్పటికీ కూడా పురుషులు స్త్రీలను నీచస్థాయికి దించకుండావుంటే సామాజికస్థితి రోజు రోజుకు యింత పతనావస్థకు దిగజారి వుండేదికాదు.

ఉదాహరణకు టాహిటీ ప్రజల విషయమే చూద్దాం. కెప్టెన్ కుక్ తన యాత్రావర్ణనలో టాహిటీప్రజల దాంపత్యజీవితం అతి పతనావస్థలో ఉన్నదన్నారు. అందగత్తెయగు స్త్రీ ఒకపురుషునితో సంతృప్తి చెందేది కాదు. అత్తవారింటికంటే పుట్టిల్లు కొంచెం ఉన్నతమైనదైతే తనకు ఎక్కువమంది భర్తలు కావాలని అడిగి పొందేహక్కు ఆమెకుండేది. కెప్టెన్ కుక్ అనంతరం అక్కడికి వెళ్ళిన యాత్రి

కులు కూడా ఈ విషయం నిజమేనని అంగీకరించారు. ఇవన్నీ యిలాఉన్నా, ఆ దేశంలోని పురుషులు స్త్రీలను చాల గౌరవంగా చూచేవారు బహుశః అందుచేతనేనేమో వారు శిశువులనుకూడా ఆప్యాయతతో శ్రద్ధగా పెంచేవారనుకుంటాము. యాత్రీకులందరూ వారివంటి శాంతమూర్తులు, సుశీలురు, అతిథిసేవ చేసేవారు. నాగరిక సమాజాల్లో కూడా ఉండరని ఏకకంఠంతో అంగీకరించారు. వారికి దోపిడీలు, దొంగతనాలు అంటేనే తెలియదట. వారి సాంఘిక స్థితిని అనుకరించాలని మా అభిప్రాయం కాదు, కాని వా రెప్పుడూ స్త్రీలను అగౌరవపరచలేదు. యితర అనాగరిక జాతులువలె స్త్రీలను అధఃపాతాళానికి త్రొక్కలేదు. అందుచేతనే 1903 లో సి. యల్. రేగ్ అనే ఆయన తన The Romance of the seas అనే గ్రంథంలో యిలావ్రాశారు— స్త్రీల కర్తవ్యం ఇంటిని చక్కదిద్దుకోవడం, పిల్లలయెడల శ్రద్ధవహించడం, ఉత్తమ గృహిణి ఉత్తమజనని కావడం, రాజకీయాలకుదూరంగాఉండడం బట్టలు కుట్టడమూను. టాహిటీ స్త్రీలు బోయిన్ స్త్రీలకంటే ఎంతో మెరుగని మా ఊహ. బెల్ గ్రేవియన్ స్త్రీలుకూడా కొంతవరకు వారితో సరితూగగలస్థితిలో ఉంటారు.

సిలోన్‌లోని అనాగరిక ఛేద్దాజాతి ప్రజలు స్త్రీలను చాలా గౌరవిస్తారు. వారు ఒక భార్యఉండగా మరొక స్త్రీని ఏ పరిస్థితుల్లోనూ చేపట్టరు. తమ జీవితాంతం భార్యను వదిలి పెట్టరు. వీరినిగురించి జర్మన్ వైజ్ఞానికుడు హెకెల్, యూరపునందలి అనేక నాగరికజాతులకంటే వీ రెంతో సత్యవంతులు, న్యాయశీలురు అనీ, అలాంటి స్నేహపాత్రులు

ప్రపంచంలో మరెక్కడా దొరుకరనీ అన్నారు. డాయకే, తోడా జాతులవారినిగురించి కూడా యిలాగే చెబుతారు. శీల సౌందర్యంలో టిబెట్ స్త్రీలు చాలా పేరుపొందారు. వారు ఒకేసారి ఎక్కువమంది అన్నదమ్ములను భర్తలుగా స్వీకరించడమేకాక, తనకుజాలికలిగితే ఇష్టపడుతున్నవారి అభ్యర్థనను కూడ నిరాకరించరు. అయినా పురుషులు వారిని గౌరవంగానే చూస్తారు. బహుశః అందుచేతనేనేమో రాజా రామమోహనరాయ్ టిబెట్ స్త్రీలనుగురించి ఇల్లావ్రాశారు– "విపత్సమయంలో ఒక టిబెట్ స్త్రీదయవల్లనే నా ప్రాణం రక్షింపబడింది. 40 సంవత్సరాలు జరిగినా ఇంకా ఆ స్త్రీలను తలచుకుంటే నాకళ్ళలో ఆనందాశువు లూరుతాయి". ఈ స్త్రీల కారణంగానే వారు జీవితాంతం స్త్రీలను గౌరవిస్తూ వచ్చారనవిషయం వారే చెప్పారు.

ఇక్కడ పాఠకుల కొరకు మనవి. యీ విషయాలన్నీ చెబుతూ అశ్లీలగుణగానంచేస్తున్నామని భ్రమపడకండి. ఆ స్థితిలోకూడ స్త్రీలను గౌరవించి వారికి విలువయిచ్చి పురుషుడు మోసపోకుండా నిలిచాడు. సహజంగా స్త్రీలకు ఒక యదార్థమైన విలువ ఉంది. అందుచేతనే పురుషుడు ఓడిపోకుండా విజయుడైనాడు.

ఇప్పుడు విపరీతమైన ఉదాహరణ ఒకటి తీసుకుచూదాం. అది ఫిజీద్వీప స్త్రీలను గురించినది. ఫిజీ స్త్రీలవంటి పతివ్రతలు యింకెక్కడైనా కన్పిస్తారనడం సందేహాస్పదమే. వారు తమ భర్త సమాధిపై ఇచ్ఛాపూర్వకంగా ప్రాణత్యాగంచేసేవారని ఇదివరకే చెప్పాము. కాని అక్కడి పురుషులు బహు వివా

హేలు చేసుకోవడమేగాక, చీటికీమాటికీ స్త్రీలను హత్యచేసే వారు. అక్కడి స్త్రీలస్థానం యింటి పెంపుడుజంతువులాంటిది. ఇంకా నిజంచెప్పాలంటే, అంతకంటే తీసికట్టనని చెప్పవచ్చు. అచటి స్త్రీలు తమ సంతానం దొంగలు, దోపిడిగాండ్రు, హంతకులూ కావాలని ప్రార్థించేవారు. బారిపురోలు మాత్ర హత్యతోనే తమ విద్యాభ్యాసం ప్రారంభించేవారు. అది విని తండ్రి నవ్వి "నా కొడుకు వీరుడౌతాడు" అనుకునేవాడు. ఆదేశపు స్త్రీల కటికహృదయాన్ని గురించి ఇలావ్రాశారు–పురుషులు యుద్ధాల్లో ఓడించిన శత్రువులను బందీలుగా పట్టుకొచ్చి వారిని చంపి తినేముందు స్త్రీల వినోదంకొరకు వారికి అంతఃపురంలోకి పంపేవారు. ఆ స్త్రీలకు బాగా హుషారైన ఆట ఏమిటంటే : ఆ ఖైదీలను కాళ్ళూ చేతులూ బంధించి, పదును గల చాకుతో బందీ కళ్ళు ఊడబెరికేవారు. స్త్రీ లందరూ ఆ దురదృష్టవంతునిచుట్టూ చేరేవారు. అతని కాళ్లూచేతులూ బంధించి కొందరు కళ్ళూడబెరుకుతూంటే, మరికొందరు పొట్ట చీల్చి ప్రేగులు బయటికి తీసేవారు. ఆ ఖైదీ మరణవేదనతో తన్నుకుంటూవుంటే స్త్రీలు కేరింతాలుకొడుతూ ఆనందించే వారు. ఇదీ ఆ దేశ స్త్రీ హృదయం! ఇంతైనా వారి పతిభక్తి, పాతివ్రత్యం ప్రపంచంలో ఏ సభ్యజాతిలోను కానరాదు. అలాంటప్పుడు వారిలో ఈ కటికతనం ఎలావచ్చింది? పాతివ్రత్యంలో సాటిలేని ఆ స్త్రీహృదయం ఏ దోషాలవల్ల రాయిగా అయిపోయింది?

స్త్రీ యెడల పురుషుల సహృదయత్వం, న్యాయ ప్రవర్తనలనుగురించి చాలా ఉదాహరణలిచ్చాము. యిన్ని ఉదా

హారణలతో కూడా విషయం గ్రహించలేకపోతే యింకా యివ్వడం అనవసరం. ఒకటిరెండు స్థూలవిషయాలతో ముగిస్తాము.

స్త్రీ పురుషులమధ్య వుండే వివిధసంబంధాలను చూపి దాంపత్యజీవితాన్ని గురించి వివరించాము. యితర సంబంధాలు సరిగా లేకపోయినా ఈ సంబంధం స్పష్టంగా ఉంటుందని మాత్రమేకాక, ప్రాణికోటిలో ఉండే సంబంధాలన్నిటిలోకి ఈ సంబంధంయొక్క ఆకర్షణ ఎంతదృఢమైనదో దానివాంఛ, మోహము అంతె స్థిరమైనవిగా ఉంటాయి.

మనదేశంలో విజ్ఞులు ఆపురసాలలోనూ మధురరసం శ్రేష్ఠమైనదని చెప్పారు. ఈ మధురరసం సంభోగ సంబంధం వల్ల ఏర్పడుతుంది. యథార్థంగా సంఘజీవియగు మానవుడు ఎన్నిసంబంధాల రసానుభూతిపొందుట నేర్చాడో, వాటన్నిటిలోకీ మధురరసంలోనే సమస్తరసాల వికాసం కన్పిస్తుంది. అందుచేతనే కొంచెం శ్రద్ధగా గమనిస్తే ఏదేశంలో ఈ మధుర రససంబంధమైన భావాలు క్షీణమై బంధనాలు క్షణిక మయ్యాయో, ఆదేశంలో ఆ నిష్పత్తిలోనే స్త్రీపురుష సంబంధాలుకూడ హీనమయినాయి. ప్రపంచంలో ఏదైనా ఒక దేశంలోగాని జాతిలోగాని భార్యకంటె తల్లి, సోదరీ సంబంధాలు ఎక్కువ ప్రేమపాత్రంగా ఉన్నాయని అంటే అది వినడానికి ఎంత బాగా ఉన్నా వాస్తవానికి అది మిథ్యయే. వీటి మూలంలోకి మనం కొన్ని ఉదాహరణలద్వారా చూడకపోతే ప్రపంచం తల్లక్రిందులుగా ఉన్నదనే భ్రమకలుగుతుంది. అనాగరిక అర్ధనాగరికజాతుల్లో ఒకప్రక్క స్త్రీయొక్క స్థానం పతనమైన ఉదాహరణలు, ఆమె దురవస్థను తెలిపే ఉదాహరణలు

ఎన్నో వున్నా, మరొకప్రక్క స్త్రీ ఇంటికేకాక ఆ సంఘానికే యజమానురాలుగా వున్న సంఘటనలు కనబడతాయి. ఫిజీ ద్వీపంలో వృద్ధస్త్రీలు చాలా గౌరవింపబడేవారు. వారి మాటే అన్నివిషయాల్లోను చెల్లేది. మెక్సికో, హాయదా ఆది మజాతుల్లో కూడా అలాగే. చీనాదేశంలో వృద్ధురాలగు బామ్మ యింటికి నాయకురాలు. సుమత్రా, మెడగాస్కర్, కాంగోలలో స్త్రీలను రాణులను చేయడంకూడా జరిగింది. అయితే మాత్రం? కొంచెం లోతుగాచూస్తే స్త్రీలు భారమైన ప్రాణులుగా ఎంచబడుతూ, వివాహసమయాల్లో పెయ్యదూడలతో సమానమైన విలువమాత్రమే కలిగియుండి, సంతానోత్పత్తికి అసమర్థులవగానే బజార్లో అమ్మివేయబడుతూ, 'దాసి' అనే పర్యాయపదాన్ని కూడా కలిగియుండేటప్పుడు స్త్రీల కర్తృత్వంఏమిటి? అందుచేతనే యీవిషయంలో బోనోక్రాఫ్టు కర్తృత్వం అనేది నామమాత్రంగానే కనిపిస్తోంది అన్నాడు.

మనఇళ్ళల్లో విషయమే చూచుకున్నా యింటికి యజమాని లేకపోతే ఇంట్లోని ముసలితల్లిగాని, నాయనమ్మగాని యజమానురాలౌతుంది. ఆ తర్వాత మనస్సుకు గోచరంగాని పాపాలంటూ ఉండకుండా, మనస్సును విప్పిచెప్పాలనుకుంటాము. ఈ దేశంలో ఆస్తిలోభంచే గురుజనులుకూడా కాల్చి చంపివేయబడేవారు. పురుషుల అనేక బాధ్యతలలోనుంచి స్పెన్సరుదొరగారికి స్త్రీలు తమభర్తలకు విషంయిచ్చి చంపడం హిందూసమాజంలో పరిపాటిగా కనపడింది. అందుకు ఆస్తియే కారణమని ఆయన వాదన. స్పెన్సరుదొరకు ఈ విషయాన్ని ఏ పండితుడు చెప్పాడోగాని, ఆ విదేశీయుడగు

స్మృతులను స్త్రీల అపరాధం ఒకటి దొరికింది! ఈ దేశంలో స్త్రీలను బతికిస్తు కాల్చటంనే ఆచారాన్ని చూచి, బహుశా ఆయనను స్త్రీ మహాపరాధ మేదో తోచివుండవచ్చు. పాపం! స్త్రీ కాలి మసిఅయిపోయినా విముక్తి లేదు. ఏమైనా ఇది ఆయన స్వయంగా కల్పించినది కావచ్చు. ఎందుకంటే సహగమనాన్ని సమర్థిస్తూ ఈ దేశంలోని గొప్పగొప్ప పండితులు బ్రిటనుకు అప్పీలుచేసుకున్నారు. అందులో ఈ విషయం ఎక్కడా చెప్పబడలేదు.

ఇంక అసలువిషయానికి వద్దాము. పైన చెప్పిన దేశాల్లో స్త్రీలవయస్సునుబట్టి వారి కర్తవ్యాలు చెప్పారు. అసలు దానికేమైనా అస్తిత్వమంటూ ఉన్నదా, లేదా, ఉంటే అది ఎలా ఉండిఉంటుంది అని చూడాలి. స్త్రీ పురుషుల అన్ని రకాల సంబంధాలలోనూ, స్త్రీయొక్క న్యాయమైన హక్కు ఏదైనప్పటికీ, స్థానము, సమయము, వయస్సు తేడాలనుబట్టి పురుషుడామెకు ఎప్పుడు ఏ విలువ యిస్తూవచ్చాడో అదే సరియైనదా? కాదా? వయస్సు తేడాలవల్ల మేము స్త్రీకియిచ్చిన విలువ సరిపోతుంది అని పురుషుడు అనవచ్చు. ఎలాగంటే, ఒక పండితుడు తన పుస్తకంలో 'మనువుకాలంలో వ్యభిచారం చాలా ఎక్కువగా ఉండేది. దాన్ని నిర్మూలించటానికే స్త్రీలపై యిన్ని కఠిననిబంధనలు విధించవలసివచ్చింది!' అని వ్రాశాడు. అంటే బహుశా వ్యభిచారానికి బాధ్యతఅంతా స్త్రీలదేగాని, పురుషులదేమాత్రంకాదని ఆ పండితుని వుద్దేశ్యమైయుంటుంది. ఏమైనప్పటికీ ఈ వాదనకు అసలు పునాదులంటూ ఉన్నాయా అని ఆలోచించాలి. ఈ పుస్తకంలో ఒకచోట 'బహుశా

ప్రపంచంలో స్త్రీలు అరుదైతేనే గాని వారివిలువ తెలియదని వ్రాశాము. ఈ 'బహుశా' అనే పదాన్ని వదలివేసి, స్త్రీల ప్రస్తుతస్థితిలో పురుషులు వారికి తగు విలువ యిచ్చారో లేదో చూద్దాము.

ఈ ప్రపంచంలో ప్రతిదీ ఏ ప్రాకృతిక నియమానికి లోబడివున్నదో ఆ నియమానికే వాటి విలువకూడా లోబడి ఉన్నదని ఏడమ్ స్మిత్ మొట్టమొదటిసారిగా ప్రచారంచేసి నప్పుడు ఆ విషయాన్ని అందరూ సరిగా అర్థంచేసుకోలేక పోయారు. అప్పుడు ప్రజలకు అర్థమైనదల్లా, మా వస్తువును మేము మా యిష్టంవచ్చిన ధరకు అమ్ముతాం, కొంటాం. ధరను నిర్ణయించేది వస్తువుయజమానియేగాని మరొకరికి అధికారంలేదు అనిమాత్రమే. ఈ అహంకారంవల్లనే నందసంవత్సరాలవరకు ఈ సత్యాన్ని మానవుడు విస్మరిస్తూవచ్చాడు. ఈ సత్యాన్ని యిప్పుడు అందరూ అంగీకరించారని మేము చెప్పము. కాని దీన్ని అంగీకరించినవారికిమాత్రం ఈ ప్రాకృతిక నియమాన్ని ఉల్లంఘిస్తే చివరివరకూకూడా ఎవ్వరికీ మంచి జరుగదని తెలుసు. దీనివల్ల వారికీ లాభంలేదు. ఇతరులకూ లాభం వుండదు. బియ్యము, గోధుమల బజారులోనూ లాభం ఉండదు. పిల్లలను అమ్ముకునేతావునా లాభంఉండదు.

ఈ గ్రుడ్డితనానికి ఒక చక్కని ఉదాహరణతీసుకోండి: బలవద్దీగా విలువ పెంచడానికి సజీవసాక్ష్యం మనదేశం (బెంగాలు)లో కులీనతను పంశానుగతంచేయుటే. ఇదే కనుక లేక పోతే నేడు ఎవరినైనా కులీనబ్రాహ్మణుడని అంటే ఆయన తిన్న తిడుతున్నాడని మనసులో అనుకోవాలి. వర్తమాన

స్థితిలో ప్రతిష్ఠగల బ్రాహ్మణయువకులు అత్తవారింటికి వెళ్ళి కొంత డబ్బుతీసుకొని ఆ డబ్బుతో రాత్రిళ్ళు కులాసాగాగడిపి, మర్నాడు గంజాయి, భంగ్ మస్తుగా త్రాగేస్తూ ఉంటారు. అలాంటప్పుడు ముఖ్యంగా బ్రాహ్మణసంతానం ఎంత హైన్యానికి దిగజారితేనోగాని అలాంటి పనులకు సిద్ధపడరనేది చెప్పనవసరంలేదు. కులీనుల పిల్లలకు సమాజం ప్రతిష్ఠ ఆపాదిస్తుండడంచేతనే వారింత అధోగతికి దిగజారిపోతున్నారు. ఒకవేళ వాళ్ళ యదార్థవిలువే వారికి కట్టిస్తుంటే, వాళ్ళు ఇంతగా అధోగతిపాలు కాకుండా ఉండటమే గాక సమాజంకూడా ఈ విధంగా శతాబ్దాలతరబడి లెక్కలేని ఏ పాపమెరుగని స్త్రీల రక్తాన్ని పీల్చుకొని వారి వ్యర్థజీవితాల్లోని వేడినిట్టూర్పుల అభిశాపములచే భగవత్కృపనుండి వంచింపబడి ఈవిధంగా వికృతరూపంలో ఉండేదికాదు.

ఇప్పుడింక ప్రజలకళ్ళు తెరుచుకున్నాయనిపిస్తోంది. యథార్థంగా విలువలేని మనిషికి రాజాజ్ఞచేగాని సమాజంవల్లగాని విపరీతంగా విలువ పెంచబడినట్లయితే అందువల్ల ఎన్నడూ శుభంకలుగదు. ఈ సత్యసిద్ధాంతాన్ని రెండవ వేపుకుకూడా అనువర్తింపజేసి, దేనికితగ్గ విలువను దానికివ్వాలి. అజ్ఞానంవల్లగాని, అహంకారంచేతగాని యదార్థవిలువనుంచి ఎవరినైనా వంచిస్తే వాటిఫలితాలుకూడా అంత మంచిగా ఉండవు. మిథ్య ఎన్నడూ జయంపొందదు. ఈ లెక్కప్రకారంచూస్తే ఇంతవరకూ స్త్రీకి పురుషుడు యిస్తూవస్తున్న విలువతో స్త్రీకి సరాసరి మేలే కలిగియున్నట్లయితే అదే స్త్రీయొక్క యథార్థ విలువ అని ఒప్పుకోవాల్సిందే. కానట్లయితే, పురుషుల

స్త్రీలను ఇంతవరకూ మోసగిస్తూవచ్చారనీ, ఆమెను పీడించారనీ, దానితోపాటు, సమాజానికి కీడు తెచ్చిపెట్టారనీ అంగీకరించక తప్పదు.

ఇప్పుడొక అవాంతర విషయాన్ని చెబుతాము. ఈ మధ్యనే ఒకమిత్రుడు నా ఈ పుస్తకంలో కొంతభాగం చదివి, నాది చీడబుద్ధి అని పేర్కొన్నాడు. మరొక మిత్రుడు స్త్రీపురుషుల గుప్తసంబంధాలను వివరించానని దోషమారోపిస్తూ పై మిత్రుని అభిప్రాయాలవంటివే వెలిబుచ్చాడు. పురుషులకు ఈ వ్యాసం రుచించదని మాకు మొదటినుంచీ తెలుసు. వారి ప్రశ్నలకు సమాధానమివ్వడానికి సిగ్గువేస్తోంది.

మొదట్లో అనాగరిక ఆదిమజాతులఆచారవ్యవహారాలను గూర్చి చెపుతూ, అవిచదివితే వారికి గగుర్పాటుకల్గించే విషయాలుకూడ వ్రాయకతప్పలేదు. కాని పురుషులదోషాలను ఎత్తిచూపాలనే ఉద్దేశంతోనే వాటిని నన్నిటినీ పేర్కొనలేదు సామాజికమానవునిగురించి "ఆదిమ అడవిజాతి స్త్రీలస్థితితో పోల్చిచూస్తే మానవజాతి నైతికోన్నతినిగూర్చి తెలిసినట్లు మరేవిధంగాను తెలియదన్న ఒక వాదన ఉంది. ఇది అత్యంతాలా నిజమని మా నమ్మకం. అందుచేతనే యిన్ని ఉదాహరణలు యివ్వవలసివచ్చింది. దీన్నిబట్టి మానవుని నైతికాభివృద్ధిని గాని, పతనాన్ని గాని తెలుసుకొనుటకు మరో మార్గం వున్నదోలేదో మాకు తెలియదు. అందుచేతనే ఇన్ని విషయాలు చెప్పవలసివచ్చింది. నా మిత్రులిద్దరూ దీన్ని నమ్మినా, నమ్మకపోయినా సరే.

మళ్ళా మధురరసం గురించి ఆలోచిద్దాము. ఎందుకంటే ఈ మధురరసము ఎన్నివిధాలుగా ఎన్నివైపులనుంచి వ్యక్తిని నిజమైనమనిషిగా తయారుచేసిందో తెలుసుకోవడం అవసరం. ఇందాకే ఇదివరకు చెప్పినదాన్నే పునరావృత్తి చేయవలసివచ్చినది. మానవునిలో ఈరసజ్ఞానం ఎంతలోపిస్తుందో అంతఅమానుషికంగా తయారౌతాడు. మనిషి ఈరసాన్ని పుష్కలంగా కలిగివుండాలన్న కాంక్షతోనే మనిషి అజ్ఞాతభావంతోనే పాతివ్రత్యాన్ని సృష్టించగలిగాడు. ఈ రసంయొక్క మహాత్మ్యాన్ని వర్ణించడంవల్లనే మనిషి కవి కాగలిగాడు. ఈ రసాన్ని నిర్లక్ష్యం చేయడంవల్లనే భారతదేశమందు ఒక ప్రత్యేక యుగంలోనూ, యూరపునందు మధ్యయుగంలోనూ స్త్రీని స్త్రీపురుష సంబంధాల విలక్షణప్రతినిధిగా అంగీకరించి తప్పిదంచేసి పతనమార్గాన్ని పట్టారనేసిద్ధాంతం త్రోసివేయుడానికి వీల్లేనిది. ఈ రసజ్ఞానంయొక్క ప్రధానాశయం స్త్రీ సౌందర్యం. పురుషుడు ఎంత రాక్షసప్రవృత్తిగలవాడైనా స్త్రీ సౌందర్యాన్ని ఆదరించకుండా వుండలేడు. ఎద్దులు లేక స్త్రీలనుకట్టి నాగలిదున్నే పురుషజాతివారుకూడా అందమైన స్త్రీలను నాగలికట్టడంమానేసి, అందం తగ్గుతున్నకొద్దీ నాగలికి కడుతూండేవారు. కొరియా చరిత్రలోకూడా కొరియా దేశస్థులగురించి యిలాంటి విషయాలే ఉల్లేఖింపబడ్డాయి.

ఈవిధంగా సౌందర్యంవల్ల స్త్రీలకు కొంతమేలు—అది కొద్దే కావచ్చు—కలుగుతున్నదన్నది స్పష్టమే. యీ సౌందర్యం స్త్రీకి మేలివ్వడమేగాక పురుషుని హృదయప్రవృత్తిని మధురంచెయ్యడానికి కూడా తోడ్పడుతుంది. కనీసం

రెండు మూడు రోజుల వరకైనా తన క్రూరత్వాన్ని అణచుకోవడం నేర్చుకుంటాడు. స్త్రీ ఉద్యమంవల్లనే అతని ఈ నేర్చుకోవడం ఎక్కువ కాలం నిలవడంలేదు. ఏ సమాజం ఎంతగా పతనం చెంది ఉంటుందో, స్త్రీ స్థితి ఎంతగా కష్టాలకు కాణాచిగాను, దుఃఖభాజనంగానూ ఉంటుందో ఆ సమాజంలో ఆ పరిణామంలోనే స్త్రీ సౌందర్యం క్షీణిస్తూ, క్షణభంగురమై ఉంటుంది. దీనికి ఎక్కువగా ఉదాహరణలిచ్చి ఈ పుస్తకాన్ని పెంచదలచలేదు. కాని చాలమంది యాత్రికులు స్త్రీ స్థితి హీనంగా ఉండే జాతుల్లో పురుషులే చూడడానికి అందంగా ఉంటారనీ, స్త్రీలు బాగా కురూపులుగావుండి, చూడడానికే అసహ్యంగా ఉంటారనీ వ్రాశారు. స్త్రీలు ఎక్కువగా పరిశ్రమ చేయడం, చిన్నవయస్సులోనే పిల్లలను కనడం, వారిని పోషించే భారం మీదపడడం, పురుషులు తినగా మిగిలిన ఎంగిలికూడు తినడం, చీకటికొట్లాల్లో బంధింపబడివుండడం యివన్నీ వారి సౌందర్యం తగ్గిపోవడానికి కారణాలు కావా? అలాంటప్పుడు వారి సౌందర్యం చిరస్థాయిగా ఎలా ఉండగలదు? అందం అంటే ఒక్క అందమే కాదు, ఆరోగ్యంకూడా ఉండాలి కదా. అందంతో పాటు ఆరోగ్యంకూడా నష్టమైపోయి మూడునాళ్ళ ముచ్చటతో యౌవనం దిగజారిపోయి, దుర్బలమైన స్త్రీలనుండి బలవంతంగా చేసుకోగలిగినంతా పనులు చేసుకుని పురుషులు ఊరుకుంటున్నారు. అందుచేతనే అంతటా అసౌఖ్యం వృద్ధి చెందుతూంది.

స్థలాభావంచే ఊరుకోవలసివస్తోందిగాని, లేకపోతే సమాజంలో స్త్రీ స్థానం పడిపోతున్నకొద్దీ స్త్రీ-పురుష వర్ణా

పరిమాణంకూడా ఎలా పడిపోతోందో నిరూపించేవారము, అందుచేతనే అర్ధనాగరక అనాగరకజాతుల ప్రజలు స్వల్ప కాలమే జీవించేవారు. నేడు మనం మన కుటుంబాలవైపు దృష్టిని మరల్చితే, వారికీ మనకీ సామ్యము కనబడదు. వాళ్ళ వలెనే మనస్త్రీలూ కొద్దిరోజుల్లోనే తమ ఆరోగ్యాన్ని యౌవ నాన్ని పోగొట్టుకోకుండా ఉండేటట్లయితే, వారి గర్భంనుండి జన్మించే సంతానం రోగిష్టులు, అల్పాయుష్కులు కాకుండా ఉండేటట్లయితే, పిన్నవయస్సులోనే వితంతువైతే పుట్టింటికి జేరి, తనజీవితాన్ని భారంగా చేసుకోకుండా ఉండేటట్లయితే, అవసరం కలిగినప్పుడు వారు వాస్తవమైన స్వేచ్ఛాజీవితాన్ని నిర్వహించుకునే అవకాశాలను లేకుండా చేయకపోతే ఇంతవరకు మనం స్త్రీలకు యిస్తూవస్తున్న విలువే సరియైన విలువయని మనం ఒప్పుకోకతప్పదు. లేకపోతే మనవల్ల చాలా గొప్ప తప్పిదం జరిగినదని చెప్పి, దాన్ని దిద్దుకోవటానికి మనం బాధ్యులముకావాలి. అనేక నిషేధాలసంకెళ్ళను స్త్రీలకు తగిలించి మనఖ్యాతిని చాటుకుంటూ తిరిగితే దానివల్ల సత్ఫలితాలు ఏమైనా ఉంటాయా అని మనం విమర్శించుకుని చూచుకుంటే ఎన్నో సమస్యలకు పరిష్కారమార్గం లభిస్తుంది. తమ మంచిచెడులను విచారించడం అంత కష్టంకాదు. కాని కష్టమైనదల్లా దాన్ని స్వీకరించడమే. కష్టమైన యీ కార్యభారాన్ని పురుషులు నిర్భయంగా స్వీకరించాలని నా అభ్యర్థన. అలాంటప్పుడు ఏ విధి నిషేధాలు ఉంటాయి? ఏవి ఉండవు? ఏ విధి నిషేధాలు సమయానుకూలోపయోగంగా ఉంటాయి? ఏ విధి నిషేధాలవల్ల ప్రస్తుతం మేలుకలుగగలదు— మొదలైన

న్నీ వాటికంతటవే నిర్ణయింపబడగలవు. అప్పుడు మనువు కాలంలో వ్యభిచారం ఉన్నదా లేదా అనే వాదనలవంటివి అవసరం లేకుండానే ఇది జరిగిపోతుంది. 'మధురరసాన్ని స్త్రీల నుండి పూర్తిగా పిండివుచ్చుకుంటామేగాని, మేము స్వయంగా ఏమాత్రమూ ఇవ్వనుండియున్నాము' అనవచ్చి చెల్లబోదు. జగదీశ్వరుని న్యాయస్థానంలో ఏదో ఒకరోజున పురుషులు పట్టుబడి పోకతప్పదు. ఆనాడుకూడా రసం మధురంగానే ఉండవచ్చుగాక, కాని ఫలితాలుమాత్రం మధురంగా ఉండవు.

మరొకవిషయం. సమాజ నియమాలను పరిశోధించి తమ శ్రమఫలితాలను లిపిబద్ధం చేసినవారు సమాజంలో స్త్రీ స్థానము పతనం చెందడంతో పాటు బిడ్డలస్థానంకూడా దానంతట అది దిగజారిపోతుందనే సత్యాన్ని వెల్లడించారు. ఇది ఎందుకు జరుగుతుందో, లేక యిలా జరగడం ఎలా స్వభావసిద్ధమో తెలుసుకోవడం ఏమంత కష్టం కాదు. తన తల్లితో శిశువుకు ఉన్నంత సంబంధం తండ్రితో ఉండదనేవిషయం ఎన్నో ఉదాహరణలిచ్చి ఇదివరకే చూపాము. అందుచేతనే మనం మహాపురుషులజీవితాలనుపరికిస్తే వారందరికీ తాము ఉన్నతపథంలో ప్రయాణించుటకు అనుకూల వాతావరణం కల్పించిన తల్లులు దొరికారనేది స్పష్టంగా తెలుస్తుంది. తల్లులస్థాయి పడిపోయి, వారితోపాటు శక్తియుక్తులను వికసింపజేసుకోవలసిన బాలల స్థితికూడా పతనమైపోతే, పోటీలమయమైన యీ యుగంలో ప్రపంచంలోని యితరజాతులతో సమానంగా ఈ జాతి నిలువజాలదు. అయితే ఇన్నాళ్ళూ మనజాతి ఎలా నిలిచిఉండ గలి

గింది అం ప్రశ్నిస్తే ఏదో విధంగా ప్రాణం నిలుపుకొని జీవించి ఉన్నా ననుకోవడమే మానవుడు జీవించడం కాజాలదు అని మాత్రమే సమాధానంగా చెప్పవలసివుంటుంది.

సమాజంలో స్త్రీ స్థానం పడిపోవటంతో స్త్రీ పురుషు లిద్దరూ పతనం చెందుతారనీ, దానినే అనుసరిస్తూ పోతూ ఉంటే సమాజంలో స్త్రీకి ఎట్టిస్థానం ప్రాప్తించగలదో నిర్ణ యించడం కష్టంకాదనేది నిర్వివాదాంశమే. స్త్రీ-పురుషు లిద్దరూ కలిస్తేనే సమాజం. అంతేగాని ఒక్క స్త్రీ అనీ కాదు, ఒక్క పురుషుడు అనీ కాదు. యిద్దరికీ కొన్ని బాధ్యతలూ, కర్తవ్యాలూ ఉంటాయి. ఆ కర్తవ్యాలు సరిగా నిర్వహింప బడుతున్నాయో లేదో మాత్రం చూడవలసియున్నది. కర్త వ్యంఅంటే కేవలం తన కార్యకలాపాలు అనే అర్థంకాదు; కర్త వ్యంఅంటే అర్థం రెండవపక్షంవారి కర్తవ్యనిర్వహణకు కూడా తనకున్నన్ని అవకాశాలను కలిగించడం. పాఠకులు ఈ విష యాన్నే గమనించాలని కోరుతున్నాము.

మరొక విషయంకూడా వున్నది. పురుషులు చేసే పనులన్నీ స్త్రీలుచేయలేరు. అలాగే స్త్రీలుచేసే పనులన్నీ పురుషులూ చేయలేరు. అంతేకాదు, స్త్రీలు పురుషులు ఇద్దరూకలిసి చేయవలసినపనులు ఏ ఒక్కరో చేద్దామన్నా సవ్యంగా జరుగవు అందుచేత స్త్రీల కర్తవ్యాలు నిర్వహింప బడుతున్నాయో లేదో మనసమాజం చూస్తుండాలి. వారు తమ పనులు నిర్వహించుటకు తగుస్థానము, న్యాయమైన అవకాశాలు కల్పించబడుతున్నాయో లేదోకూడా చూడాలి

జైల్లో ఖైదీలచే ఏదైనా పనిచేయించాలన్నా వారి సంకెళ్ళను కొంత సడలించవలసిన అవసరం వుంటుంది. అంటే వాటిని పూర్తిగా ఒక్కసారిగా వదిలివేయమనికాదు. అలా చేస్తే అమెరికా స్త్రీలస్థితే వచ్చిపడుతుంది. అమెరికన్ స్త్రీల హద్దులేని స్వాతంత్ర్యం విశృంఖలత్వంగా మారిపోయింది. ఒకప్పుడు రోమ్‌లో గొప్పింటి స్త్రీలను వేశ్యలుగా మారకుండా కాపాడేందుకు శాసనం చేయవలసివచ్చినదట. టిబెట్టులో ఒక్కే స్త్రీకి చాలమంది భర్తలుండే విషయాన్ని చర్చిస్తూ ఒకరచయిత పరిహాస పూర్వకంగా, కొంపతీసి యిది చదవడంవల్ల అమెరికన్ స్త్రీలు తమకుకూడా ఎక్కువమంది భర్తలను కలిగియుండే అధికారంఉండాలని అంటారేమోనని వ్రాసినది ఏదో పుస్తకంలో చదివినట్టు జ్ఞాపకం. బహుశా అమెరికన్ స్త్రీల వేషాలు, తైతక్కలుచూచి పురుషుల కాళ్లూ చేతులూ చల్లబడి ఉంటాయి. అందుచేతనే కొన్నికట్టుబాట్లుకూడా అవసరమే ఎందుకంటే మరోప్రక్క అన్నిబంధనాలను ఒక్కసారిగా తీసివేస్తే పురుషులుకూడా ఎంతనిరంకుశులు, అనాచారులుగాతయారౌతారో అట్టి ఉదాహరణలకు భారతదేశంలో కొదువలేదు.

ఏమైనప్పటికి స్త్రీలకు వారి కర్తవ్యనిర్వాహణకు న్యాయోచితమైన స్వాతంత్ర్యము, అవకాశాలు ఉండాలి. అయితే స్త్రీల కర్తవ్యాలేవి, పురుషులు నిర్వహించవలసినవేవి, యిద్దరూకలిసి చేయవలసినవి ఎవ్వి? అనేదికూడా నిశ్చయించాలి. మానవసమాజంలో ఎంతలోతుకు దిగిచూచినా వారంతా ఏదోఒక తప్పు చేస్తున్నారనీ దానివల్లే వారికే పావ

కాశమూ లేకుండాపోయిందనీ తెలుస్తుంది. చాలాచోట్ల పురుషులు కేవలం యుద్ధాలు చేయడం, వేటాడడం మాత్రమే చేసేవారు. జీవిత నిర్వహణకు సంబంధించిన యితరపనులన్నీ స్త్రీలే చేసేవారు. స్త్రీలు నీరు తెచ్చుకునేవారు. వంటచెరకు నరికి తెచ్చుకునేవారు, సామాను మోసేవారు. నేల దున్నేవారు, పిల్లల్ని కనేవారు, పంట చేసేవారు, పిల్లలపోషణ చేసేవారు, వేటాడబడిన జంతువులను తమస్థావరాలకు ఈడ్చుకుపోవటానికి కూడా స్త్రీలు పురుషుల వెంట వెళ్ళేవారు. వీటన్నిటికారణంగా ఏ ఫలితాలు రావాలో అవే వచ్చాయి కూడాను.

అన్ని దేశాలలో స్త్రీ పురుషుల పనుల విభజనపద్ధతి ఒక్కలాగా ఉండదు. కాని కొంచెం శ్రద్ధగా గమనిస్తే మాత్రం నాగరికత పెరుగుదల ప్రమాణంతో పనివిభాగానికి సాదృశ్యం ఉన్నదనీ ఈ ప్రమాణం పెరుగుతూన్నకొద్దీ ఈ సాదృశ్యంకూడా తగ్గిపోతున్నదనీ తెలుస్తుంది. ఎక్కడనుంచైనా నీళ్ళు తేవలసిన అవసరం కలుగుతుందనుకోండి. యే ఫ్రెంచివాడో, బ్రిటిష్‌వాడో అయితే తానేవెళ్ళి నీరు తెచ్చుకుంటాడు. కాని, మనదేశంలో అయితే పురుషునికి నీళ్ళు తీసుకురావటానికి సిగ్గు! అందుకని గర్భవతియైన భార్యభుజానే ఒక బిందెపెట్టి, తాను సిగ్గునుంచి తప్పించుకుంటాడు. పెరూ ఉచ్ఛస్థితిలో ఉన్నప్పుడు అక్కడి పురుషుడు రాట్నం వడికి, బట్టలు నేస్తూఉంటే, స్త్రీలు పొలందున్ని, పంటలు పండించేవారు, నేటికీ సామోయ్ ప్రజల్లో పురుషులు ఇంట్లో వంట

పనులు వగైరా చూస్తూవుంటే స్త్రీలు సరుకులు కొనటానికి సంతకు వెళ్తారు. అబిసీనియా పురుషులకు బజారుకు వెళ్ళడమంటే తగని నామోషీ. కాని వాళ్ళు రేవుకువెళ్ళి స్త్రీలపై తమపై - అందరిపై బట్టలు ఉతకటమంటే తప్పుగా భావించరు. ఇలాచూస్తే, అన్ని దేశాలలోనూ స్త్రీ పురుషుల పనినిర్ణయం ఒక్కలాగే లేదు. అలా చిన్నచిన్న తేడాలున్నా యిబ్బంది లేదు. కాని అవి ప్రాకృతిక నియమాన్ని అతిక్రమిస్తే మాత్రం నష్టం వాటిల్లడం అనివార్యమౌతుంది. స్త్రీలుచేసే పనులు చేస్తూకూచుంటే కోట్లకొద్దీ పురుషులు అసమర్థులు, అకర్మణ్యులు అయిపోవునట్లే డా మోహిరాజుయొక్క స్త్రీసేనకూడా Unsexed (లింగహీన) యుద్ధమే చేయగలుగుతుంది. దీనివల్ల తనకూ లాభంలేదు, దేశానికీ ప్రయోజనం ఉండదు.

పురుషోచితమైనపనుల ఏర్పాట్లు చూచేకొందరు విజ్ఞులు ఆదిమయుగంలో స్త్రీ - పురుషుల్లో స్త్రీస్థానమే ఉన్నతమైనదని అభిప్రాయపడ్డారు. స్త్రీలే నాగరికతా నిర్మాతలు. ఏ దేశప్రజలు అధికయుద్ధప్రియులో—అంటే చెయ్యాలని కాకపోయినా, ఆత్మరక్షణ కొరకైనా యుద్ధాలుచేశారో, వారు అంతఅధికంగా తమ స్త్రీలపై అత్యాచారాలు చేశారనీ, తమ శారీరకబలాన్ని స్త్రీలపై అంతఎక్కువగా ప్రయోగించారనీ స్పెన్సర్ స్పష్టంచేశాడు. స్త్రీలు తమ స్వాభావిక కోమలత్వం, నమ్రతలవల్ల ఇచ్ఛాపూర్వకంగానే అన్నికష్టాలు, పరాధీనత సహించలేదు. వారు తమ శారీరక దౌర్బల్యంవల్ల వాటిని ఎదుర్కోలేకపోయారు. అందుచేతనే వారు యివన్నీ సహించి, అణగిమణగి ఉన్నారు. ఒకవేళ తమ శరీరబలంతో

స్త్రీలు పీటిని ఎదిరించగలిగియుండినట్లయితే వారు లొంగి ఉండేవారు కాదు. చరిత్రలో స్త్రీలకు అవకాశం దొరికినప్పుడు వారూ పురుషులకు ఏమాత్రం తీసిపోని రక్తపిపాసువులుగాను, కఠినులుగాను వ్యవహరించారు. అయితే పురుషులు తమ శరీర బలాధిక్యతవల్లనే స్త్రీలను అణిచిపెట్టి ఉంచలేదనీ, సమాజ శ్రేయంకోరకే దూరమాలోచించి వారిని అణచిఉంచామనీ అంటేమాత్రం, అది శుద్ధఅబద్ధం.

స్పెన్సర్ వాదాన్ని యధాతధంగా అందరూ ఆమోదించారా అంటే, లేదు; కాని స్పెన్సర్ వాదంలో ఎక్కువ పటుత్వం కనబడుతోంది. 'యుద్ధప్రియత్వం అనివార్య నిర్బంధ సహాకారానికి ప్రాధాన్యమిస్తుంది' అని స్పెన్సర్ అభిప్రాయం. దానివల్లకలిగే ఫలితాలను స్పెన్సర్ యిలా వివరించాడు—"అందుచేతనే స్త్రీలను ఎత్తుకుపోవడం, అమ్మడం సందర్భాలలో వాళ్ళకుండే అధికారాలనుగురించి ఆలోచించబడలేదు; స్త్రీ పురుషుల బహువివాహాల సందర్భంలో స్థితి, హోదాల తేడా ఉంది; స్త్రీలను పనిచేసే దాసీలుగా, బానిసలుగా చూడడం జరిగింది; ఇందువల్లే పురుషులకు తన భార్యాబిడ్డలపై అధికారం ఏర్పడేది. అందువల్ల భార్యాబిడ్డల బ్రతుకు పురుషుని యిష్టాయిష్టాలపై ఆధారపడియుండేది. అందుచేతనే ఆ రోజుల్లో ఇంటిలోనివారందరు వయసులో పెద్దవాడైన పురుషుని ఆధీనంలో ఉండేవారు. ఇట్టి పరివారాలేకాక శిల్పం మొదలగువాటిలో మునిగిఉండి స్త్రీ పురుషుల మధ్య స్వేచ్ఛాపూర్వక ఐచ్ఛికసహకారంఉండే కుటుంబాలుకూడా ఉండేవి. అలాంటిసమాజాలు శాంతిపూర్వకంగా జీవించేవైనా, తమపని

తాము చూచుకునే చిన్నతండ్రా లైనా అవి సైనిక సరిహద్దులను దాటి ఉంటాయి. అట్టివారు సాధారణంగా చాలవరకు పరోప కారబుద్ధి కలిగివుంటారు.

వాస్తవంగా Compulsory Co-operation నిర్బంధసహ కారమే అన్నిటికన్నా చెడ్డది. యుద్ధంకొరకుగాని, పరలోక ముక్తికిగాని దేశకొరకైనప్పటికి ఇట్టి నిర్బంధసహకారము ఎక్కువైనకొద్దీ స్త్రీ స్థానం పడిపోతూఉంటుంది. మత మాహాత్మ్యము అధర్మము, అత్యాచారాలు స్త్రీకి పతనావస్థను కలిగించాయనుటకు మధ్యయుగంలోని యూరపే ఉదాహరణ. ఈ పుస్తకం ఆరంభంలోనే ఆ విషయమై చాలా ఉదాహరణ లివ్వబడ్డాయి. ఇంకా వందలు వేల నిదర్శనాలు చూపవచ్చును గాని, అనవసరమని మా వుద్దేశ్యము. మతమాహాత్మ్యము స్త్రీలను ఎందుకుగాను యింతపతనంచేసినదీ యిందులో చర్చించడం అప్ర స్తుతం కనుక వదలివేస్తున్నాము. అసలు స్థూలవిషయం ఏమంటే మతెంయొక్క ప్రధానాశయము విరక్తి. అంటే సామాన్య ప్రజలు కోరుతూఉండే వాటిమీద విరక్తికలిగివుండడమే ఆస్తి- పాస్తులు, ధన-ధాన్యాలు చాలాచెడ్డవి. అలాగే స్త్రీ కూడాను. ఆమె నరకానికిద్వారం. "ద్వారం కిమేకం నరకస్య నారీ" స్త్రీ నరకానికి ద్వారం కాబట్టే మతచర్చలకు ఇది ఉత్తమోత్తమ బీజమంత్రము. అంటే పరలోకంలో సౌఖ్యం పొందాలను కుంటే స్త్రీలను నరకానికి ద్వారంగా భావించాలి. ఈ లోక వ్యవహారం చక్కబరుచుకోవాలంటే దేశంలో వున్న వ్యవస్థని అనుసరించి ప్రవర్తించాలి. ఎన్ని పెళ్ళిళ్ళు చేసుకోదలిస్తే అన్నీ చేసుకో-అందుకు ఎనిమిది పదిమార్గాలు వున్నాయి. ఆ పైన

చనిపోయినప్పుడు ఎలాగైనాసరే భార్యలను సతో తీసుకువెళ్ళు. నీతో తీసుకువెళ్ళక లేకపోతే వారిని భయపెట్టి జడతుల్యంగా చేసిపో. Monogamy లేక ఏకపత్నీవ్రతం స్త్రీలకూ సవిక గౌరవానికి ఆధారం. అంతేకాక అది స్త్రీ పురుషుల ఏకైక ప్రాకృతిక సహజబంధనం. దానికి ఈ దేశంలో ఏమీ మర్యాద లేదు. కాని స్త్రీలు మాత్రం పాతివ్రత్యం కలిగి వుండాలని ఈ దేశంలో వన్నికన్ని అద్భుతమైన పలలు బహుశా ఏ వేరే దేశం లోనూ ఉండివుండవు.

సామాజిక సమస్యలన్నిటికీ అద్భుతమైన సమాధానం మన దేశం యిచ్చిందనీ, సఫలమవడం తథ్యమనీ, ఒక గొప్పవ్యక్తి వ్రాసిన వ్యాసంలో చదివినట్లు జ్ఞాపకం. మన దేశం అంత గొప్పసమాధానం ఏమియిచ్చిందో, దానికొరకు ప్రపంచంలో ఎవరెవరు నోరు తెరుచుకొని కూర్చున్నారో మనకు తెలియదు. కాని దానిఫలితాలను అనుభవించడం తప్పడంలేదనేదిమాత్రం తథ్యం! అందుచేతనే సాంఘిక చరిత్రను విస్మరించి చాలమంది ఆ కల్పితాలను పొగడుతూ తాళం వేయసాగారు. "మహా గొప్ప సమాధానం" "అన్ని సాంఘిక సమస్యలు" "ప్రపంచంముందున్నది" వంటి పదాలకు అర్థం తెలుసుకోవడం ఎంత కష్టమో అలాగే ఈ సాహిత్య శబ్దాడంబరా లన్నిటినీ వ్యతిరేకించడం కూడా కష్టమే. యితర జాతులు చూస్తూచూస్తూండగానే ఎంతో అభివృద్ధి చెందుతున్నాయి. స్త్రీ పురుషులు కలిసి కొద్దిరోజులలోనే పతిత సమాజాన్ని ప్రక్కతోసి, నవసమాజాన్ని నిర్మిస్తున్నారు. అందరూ తమ తమ న్యాయోచిత హక్కులను

పొంది ఉన్నతపథంలో సాగిపోతున్నారు. కాని మనదేశస్థులకు అవంటే గిట్టవు. వీరికల్లా "మహా గొప్ప సమాధాన"మే సర్వోత్తమమైనది. దాని కల్పితసాఫల్యతే అన్నిటికంటె వాంఛనీయము. అభేద్య కులతత్వపు సంకుచితతత్వం, బాల్య వివాహాలు, బాలికకు వివాహం చేయకపోతే వెలివెయ్యడం, పన్నెండుసంవత్సరాల బాలవితంతువును "పతివ్రతా దేవత"ను చేసి, ఆమె జీవితాన్ని నాశనంచేసే ప్రతాపము, యాభైయేళ్ళ ముసలివానితో పదకొండేళ్ళ బాలిక వివాహం, రెండేళ్లు తిరక్కుండానే ఆ పిల్లకు సంతానంకల్గటం ....ఇవన్నీ గొప్ప సమాధానాలే! ఇంక ఏమాత్రం నోరుత్తేపనిలేదు. నోరెత్తారో "మన ఋషులు, మునులకంటే నీకు ఎక్కువ తెలుసునా?" అంటూ పండితులు విరుచుకుపడతారు. మాకు ఒక మామిడిపండ్ల బేరం గుర్తుకువస్తోంది. ఒక మామిడిపండ్లు అమ్మేవాడు "రుచిచూడండి బాబూ, పంచదారకంటె తియ్యగా ఉంటాయి" అన్నాడు. దానిని రుచిచూస్తే అంత పుల్లటి మామిడిపండు మరెక్కడా ఉండదన్నట్లుగా ఉంది. కాని ఆ అమ్మేవానిచే ఆ మామిడిపండు పుల్లగా ఉన్నదని మేము యే విధంగానూ ఒప్పించలేకపోయాము. అమ్మేవాడు బిగ్గరగా అరుస్తూ "బలే! మీరు పుల్లగా ఉన్నదన్నంతమాత్రాన అది పుల్లగా అయిపోతుందా? మా దొడ్లో చెట్టునపండిన పండు. నాకు తెలీదా ఏమిటి?" అన్నాడు. భేష్! దీనికి సమాధానం ఏముంటుంది?

ఆంగ్ల భాషలో Ethics (నీతిశాస్త్రము) అనేదానిలో అసాదృశ్యహేతువు కానిస్థితిలో మన స్వాతంత్ర్యాన్ని యిత

కుల స్వాతంత్ర్యానికి భంగంకలుగనంతమేరవరకు తీసుకు వెళ్ళ వచ్చునని ప్రాథమికవిషయంగా చెప్పబడిఉన్నది. ఈ రెండు మాటలద్వారా మనిషి కార్యకలాపాలన్నిటినీ అదుపులో పెట్ట వచ్చు. అంతేకాక సాంఘికసమస్యలన్నీ ఇందులోనే ఇమిడి పోతాయని మా అభిప్రాయం. దీన్ని ఏ సమాజం ఎంతవరకూ అంగీకరించలేదో అంతగానే అది స్త్రీలపై అధిక అత్యాచా రాలు జరిపి, అన్యాయంచేసి, వారికి దక్కవలసినదాన్నుంచి వంచించి, దిగత్రొక్కింది. తాను దిగజారిపోయింది. ఒక ఉదాహరణమిచ్చి స్పష్టంచేస్తాము. నిరంతరరోగపీడితయై, విద్యావిహీన అయిన ఒక కన్య ఉన్నదనుకోండి. అయినా ఏదో ఒక వయస్సులో ఆమెకు వివాహంచేయడం తప్పనిసరి గదా. అంటే ఆమె మాతృత్వబాధ్యత వహించాలన్నమాట. ఆమెతోపాటే వితంతువైన మరొక అమ్మాయి ఉన్నదను కుందాం. ఆమె బలముకలిగి ఆరోగ్యవతియై, మాతృత్వార్హత కలిగి, ఆదర్శజనని కాగల లక్షణాలుకలిగి ఉన్నదనుకోండి. అయినా ఆమె తన స్వాభావిక, న్యాయోచితహక్కులనుండి వంచింపబడవలసివున్నది. ఇందువల్ల శాస్త్రాల ప్రతిష్ఠ నిల్చినా, ధర్మము, న్యాయము రక్షింపబడజాలవు. దుర్బలమైన రోగిష్ఠి యగు కన్యకు వివాహం చేయుడంవల్లగాని లేక ఆరోగ్యవతి యైన వితంతువును వితంతువుగానే ఉంచడంవల్లగాని వాటి గౌరవం నిలబడజాలదు.

నాగరిక మానవుని ఆరోగ్యవంతము, శుభప్రదము అగుబుద్ధి స్త్రీజాతికి ఏ అధికారాలు ఇవ్వాలని చెప్పుతున్నదో అదే మనుష్యుని సామాజిక నీతి; దానివల్లే దేశానికి మేలు

జరుగుతుంది. ఏ జాతికి చెందిన మతగ్రంథాలలో ఏమి వ్రాసి ఉన్నదో, ఏమి వ్రాయబడిలేదో అన్నదానివల్ల సమాజానికేమీ శుభం జరుగదు. స్త్రీ విలువ మంచిచెడ్డలను విమర్శ చేస్తూ యింతవరకూ స్థితి, హక్కులనుగూర్చియే వివరిస్తూ వచ్చాము. ఉత్పత్తి, డిమాండుల విలువలనుగురించి లెక్క గట్టలేదు. అంతేకాక ఎప్పుడైనా మగవారిసంఖ్య పెరిగిపోయి స్త్రీలు బొత్తుగా కొరవఅయ్యే సమయంవస్తుందని ఆశించలేదు. పురుషుని స్నేహము, సానుభూతి, న్యాయ-ధర్మములపైనే స్త్రీ విలువ ఆధారపడిఉంటుంది. దేవుడామెను బలహీనంగానే సృష్టించాడు. అయితే పురుషుడు పై చెప్పబడిన వృత్తులపై దృష్టిని సారించియే ఆమె బలహీనతను భర్తీచేయగలడే కాని, మతగ్రంథాల్లోని మాటలకు వ్యాఖ్యానాలుచేసి, వాటి సహాయంతో చేయలేడు.

దీనికి జపాను ఒకచక్కని ఉదాహరణ. తన సాంఘిక రీతి-రివాజుల మంచిచెడ్డలను విమర్శచేసుకొని మతాధికారుల కబంధహస్తాల్లోంచి బయటపడినప్పుడే జపాను తన స్త్రీల స్థానాన్ని సమున్నతం చేయగలిగింది. కొద్దికాలంక్రితం వరకూ చైనా స్త్రీలవలెనే జపాను స్త్రీల దురవస్థలకు కూడా అంతుండేదికాదు. "మతాధికారులు, పురోహితులు స్త్రీలకు ప్రబల శత్రువులుగాఉంటే, స్త్రీలు ఎప్పుడూ వారికి మిత్రులుగానే ఉన్నారు" అన్నది ఒక్క యూరపువిషయంలోనే కాక అనేక యితర దేశాలకు కూడా వర్తిస్తుంది. స్త్రీలను అధఃపాతాళానికి త్రొక్కివేయడంలో మతాధికారులు ఎంతవరకూ వెళ్ళారోననేది సెంట్ ఎంబ్రోజ్ చెప్పినమాటలే నిరూపి

స్తాయి. "వివాహం ఈశ్వరుని సృష్టి క్రమంలో ముఖ్య విష యం కాజాలదు; ఈశ్వరుడు సృష్టించేటప్పుడు ప్రజలు వివాహం చేసుకోవాలని ఆశించివుండడు" అని ఆయన నిస్సందేహంగానే ప్రచారంచేశాడు. ఈశ్వరుని అభిప్రాయాలు కూడా ఆ మతాధికారులకు తెలీకుండా ఉండవు! అలాంటప్పుడు మరి వాటిని విశ్వసించకపోవడానికి దమ్మెవరికివుంటుంది?

దీనికి విరుద్ధం ఇస్లాం ధర్మములో మాత్రమే కనబడు తుంది. ఖురాన్‌లో స్త్రీలకు ఎటువంటి స్థానంఉన్నదో మనం నిర్ధా రణచేసి చెప్పలేకపోయినప్పటికీ స్త్రీలయెడల గౌరవపూర్వ కంగా న్యాయంగా వ్యవహరించవలసినదిగా మహమ్మద్ ఆదే శించిన విషయాన్ని కాదనడానికి వీల్లేదు. కూతురు-కొడుకుల మధ్యగల ఆకాశ పాతాళముల భేదాన్ని ఆయన నిషే ధించారు. అరబ్బులు, యూదులలో అంతకుముందు ఎంతో శోచనీయస్థితిలో ఉన్న వితంతువులగురించి ఎంతో సానుభూ తితో న్యాయబుద్ధితో చూడమని చెప్పారు. అంతకుముందు ఎంతో భయంకరంగావున్న అరబ్బీ స్త్రీలస్థితిని ఈ క్రొత్తమతం వేయిరెట్లు బాగుచేసిన దనడంలో సందేహంలేదు. హార్న్ బెక్ గికాట్ మున్నగు రచయితలు మతాన్ననుసరించి స్త్రీలకు ఆత్మ ఉండదనీ, ముస్లిం సమాజంలో స్త్రీలు పశువులుగా చూడబడేవారనీ ఏమనుకొని ప్రచారంచేశాడో మేం చెప్ప లేము. ఖురాన్‌లో మాకెక్కడా అలాంటివిషయమే కనబడ లేదు. పైగా ఖురాన్‌లోని తృతీయాధ్యాయం చివర "దుష్కృ త్యాలు చేసేవారిని శిక్షించడంలో దేవుడు స్త్రీ-పురుష విచ క్షణ పాటించ"డని వ్రాసివున్నది. దీనినిబట్టి మహమ్మదు

స్త్రీలకు ఆత్మవుండదని అనలేదని తెలుస్తుంది 4వ అధ్యాయం లోను, యింకా అనేక చోట్ల స్త్రీలయెడల దయాపూర్వకంగా వ్యవహరించాలనీ, వారిని న్యాయమైన హక్కులనుంచి వంచించ రాదనీ ప దేవ దే చెప్పబడింది. అయినప్పటికీ ఇస్లాంమతంలో స్త్రీలస్థానం చాలా పతనావస్థలో వున్నదని చాలామంది అభిప్రాయం.

అయితే దీనికి బహుశా ఖురాన్‌లో బహు వివాహాలు అనుమతింపబడడమే కారణం కావచ్చు. నాల్గవ అధ్యాయం ప్రారంభంలో "ఇద్దరు, ముగ్గురు, నలుగురువరకూ నీకునచ్చిన స్త్రీలను వివాహంచేసుకో; కాని, నలుగుర్నిమించి మాత్రం పెళ్ళిచేసుకోకు" అని వున్నది. ఇంతేకాక విశ్వాసపాత్రులు, సాధువులైనవారు స్వర్గానికిచేరి, సుఖము ఆనందము అనుభవిస్తారని మహమ్మద్ ఎన్నో ఆశలు చూపారు. మతాన్ని నమ్మే ప్రతివ్యక్తికీ స్వర్గంలో ఎలాంటి అప్సరసలు ఎందరెందరు లభిస్తారోకూడా అతి సున్నితంగా చెప్పబడింది. కాని, మర్త్యలోక మానవస్థితి స్వర్గంలో ఎలా వుంటుందో, అలా వుండడం వాంఛనీయమో, వాంఛనీయం కాదో చెప్పబడ లేదు. సేల్‌దొరగారు కురాన్ అనువాదంలో ఇలా వ్రాశారు. ఉత్తమస్త్రీలు సుఖమయం, ఆనందమయం అయిన ఒక స్వతంత్రస్థానంలోకి వెళ్ళి అక్కడ సర్వసుఖాలు, ఆనందము అనుభవిస్తారు. అయితే ముస్లిం ఆర్థికనీతిని పూర్తిచేయుటకు గాను ఆ చెప్పబడిన సుఖాలలో వారు తమ ప్రియుఉపపతుల తోడి సుఖమనుభవించే అవకాశం ఉన్నదో లేదో నాకెక్కడా కనబడలేదు" దీన్నిబట్టి స్త్రీల యథార్థస్థితినిగురించి అనేక

సంశయాలు, అభిప్రాయభేదాలు కల్గడంలో చిత్రమేమీ లేదని పిస్తుంది. ఇదిగాక స్వయంగా మహమ్మదే ఒకచోట యిలా చెప్పారు—"అతను స్వర్గదృశ్యం చూడగా అక్కడ ఉన్న వారిలో ఎక్కువమంది బీదవాళ్లుగా కనబడ్డారు. తర్వాత నరకం వైపు తిరిగిచూస్తే అక్కడ బంధింపబడివున్న దౌర్భాగ్యుల్లో స్త్రీలే ఎక్కువమంది ఉన్నారు."

ప్రపంచంలో స్త్రీలు అవసరానికిమించి ఉండబట్టే స్త్రీలకు యిలా విలువలేకుండాపోయిందని కొందరంటున్నారు కాని లేము. ఎందుకంటే పురుషులు యుద్ధాలు చేయడంలోనే తమకు గౌరవం ఉన్నదని భావించి ఎప్పుడూ యుద్ధాల్లోనే మునిగి యుండే తమ సమాజాల్లో స్త్రీ జనాభాను పెంచుతూవచ్చిన దేశాల్లోనే స్త్రీ విలువ పడిపోయింది. ఇది సరిగా నేఉన్నా, వాస్తవంలో యుద్ధాలవల్లే స్త్రీలసంఖ్య పెరుగుతుందా అని కూడ ఆలోచించాలి. లెక్కలు వేసేటప్పుడు సాధారణంగా యుద్ధప్రియ జాతులు తమ సమాజాల్లో స్త్రీలసంఖ్య పెరుగకుండా వుండాలన్నదృష్టితోనే ఆడపిల్లలను చిన్నప్పుడే చంపి వేసేవారనే విషయాన్ని విస్మరించారు. మనదేశంలో రాజపుత్రజాతివారు తమకన్యలను వధించేవారు; అరబ్ దేశంలోని శేఖ్ జాతిలో ఆడపిల్ల పుట్టగానే గొయ్యితీసి పాతేసేవారు. కేంధా ప్రదేశంలోని అరబ్బీలు ఆడపిల్లకు ఐదేళ్ళవయస్సు రాగానే హత్యచేసేముందు తల్లిని సంబోధించి "ఇవాళ అమ్మాయి పుట్టింటికి వెడుతుంది, సుగంధద్రవ్యాలు పూసి పిల్లను సింగారించు"మని చెప్పేవారట. అంటే ఆ పిల్లను నూతిలో పారేస్తారన్న మాట. కురేశ్ జాతివారు మక్కాపద్ద

అబూాదిలామా అనే కొండవద్ద తమ కన్యలను వధిస్తూండే వారు. "ప్రాచీనజాతుల్లో చిన్నతనంలోనే ఆడపిల్లలను అడవుల్లో పారవేయుట, చంపివేయడం ఎంత ఎక్కువగా ఉండే దంటే ఈజిప్టులో పిల్లలపోషణ అంటేనే ఒక అసాధారణ విషయంగా కనబడేది" అని ప్రాచీన గ్రీక్ చరిత్రకారుడు స్రెబో ఒకచోట వ్రాశాడు ఇంకా చైనాలో ఈ అలవాటు వున్నట్టే తెలుస్తుంది. గ్రీకులనుగురించి పోసిడిప్పస్ చెప్పిన దాన్ని సేల్ దొరగారు యిలా వ్రాశారు—బీదవాడైనా తన పిల్లవాణ్ణి అడవిలో పారవేయడు, కాని ధనవంతుడుకూడా ఆడపిల్లను పెంచి పెద్దదాన్ని చేయడం చాలా అరుదు.

ప్రజలు యుద్ధాలుచేసి చచ్చిపోవటంవల్లా, లేక తమ కన్యలను హత్యచేయడంవల్లా వీటివల్లే స్త్రీలనిష్పత్తి తరగడం గాని, పెరగడంగాని జరుగదు. స్త్రీల గౌరవం-అగౌరవాలు (విలువ) వారి సంఖ్యానిష్పత్తిపై ఆధారపడిలేవు. స్త్రీలు ఆస్తి, భోగవస్తువులు అనుకునే పురుషుల నిశ్చయంపైనే వారి విలువ ఆధారపడిఉంది. అందుచేతనే పురుషులు తమ కన్యలను హత్యచేశారు; ఇందువల్లనే యితరుల కన్యలను ఎత్తుకు పోయేవారు. అందుచేతనే ఎవరికన్యనైనా ఎత్తుకుపోతే అది తనకు గౌరవభావంగా భావించుకునేవాడు. అందువల్లే ఎవడెంత ఎక్కువమంది స్త్రీలను కలిగివుంటే అంత గొప్పవాడుగా, బలశాలిగా పరిగణింపబడేవాడు. డహూబీప్రజలు యూరపులో ఒక్కొక్క పురుషునికి ఒక్కొక్క స్త్రీయే ఉన్నదనివింటే నేటికీ ఆశ్చర్యపడతారని బర్ట్‌హార్ట్టు వ్రాశాడు. ప్రపంచంలో ఇలాంటిది సంభవమని కూడా వారు నమ్మలేరన్నమాట.

ఇంతకంటె చెప్పవలసిం దేమీలేదు. ఇప్పటికే గ్రంథం చాలా పెరిగిపోయింది. పురుషులు దీన్నిచదివి తమ మనసులో ఏమనుకుంటారో తెలీదు. కాని మేము నిష్కపటభావంతో సత్యమని నమ్మినదాన్నే-స్త్రీ విలువ ఎందుకు పడిపోయింది? అసలు తగ్గిందా? లేదా? విలువ తగ్గడంతో సమాజంలో ఏమేమి అశుభాలు ఏర్పతాయి? స్త్రీలపై పురుషుల ఊహా మాత్రపు అధికారాలవల్ల ఏ ఏ అనిష్టాలు సంభవించాయి?— ఇవన్నీ స్వయంగానూ, యితరుల చెప్పినమాటల సహాయం తోను స్పష్టంచేయడానికి ప్రయత్నించాము. ఈ ప్రయత్నంవల్ల శాస్త్రాలకు అగౌరవం కలుగుతుందా కలుగదా అనిగాని లేక దేశాచారాలకు దెబ్బతగుల్తుందా లేదా అనిగాని ఆలోచించి ఎక్కడా వెనుకాడలేకపోయాము. సత్యాన్నే మేము చెబుతాము. అదే చెప్పాముకూడాను. దాని ఫలితాలనుగురించి యోచించేబాధ్యత పాఠకులదే.

ఉపసంహారంగా ఒకనాటికి స్త్రీ-పురుషుల పవిత్రబంధనాల హద్దులు ఎలాఉంటాయి, ఎలాఉండాలి? అని హెర్బర్టు స్పెన్సర్ చెప్పిన మాటలతోనే ముగిస్తాము —

"స్త్రీ పురుషుల మధ్య స్వాభావిక అనురాగబంధనాలు ఏర్పడేవరకూ వారు శాసనబంధనాలద్వారా బంధింపబడడం మంచిదికాదనే భావం రానురాను ఏకపత్నీ వివాహాలమూలంగా దేశంలో ఏర్పడేఅవకాశం ఉంది. అందుచేత స్వాభావికబంధనాలు యిద్దరిమధ్య లేనప్పుడు శాసనబంధనాలే వుంచడం అనుచిత మనేభావం ప్రబలుతుంది. విడాకులకు యిప్పటికే పెరిగిపోయిన అవకాశాలు తెల్పుతున్నదేమంటే. శాశ్వత ఏకపత్నీ

వ్రత ఆచారం అమల్లోకి వచ్చినప్పుడు, శాసనబద్ధమైన స్త్రీ-పురుషుల కలయిక—అది క్రయ చట్టమే—వివాహానికి ప్రధానాంగముగా భావించబడినది. ఇంక యిద్దరు ప్రేమచే బంధింపబడడానికి ప్రాముఖ్యత తగ్గింది. ఎందువల్లనంటే ప్రస్తుతం శాసనబద్ధమైన వివాహానే ప్రాముఖ్యం గలదిగా యెంచబడి, (ప్రేమ వివాహాలకు అంత ప్రాధాన్యత యివ్వబడటంలేదు). కాని ముందుముందు ప్రేమద్వారా బంధింపబడడమే ఎక్కువ విలువైనదని భావించబడుతుంది; అప్పుడు శాసనంద్వారా బంధింపబడటం అప్రధానమైపోతుంది. ఇందుచేతనే నేడు ప్రేమలేని వివాహబంధనాలు నిందార్హములుగాను, వర్జనీయములుగాను యెంచబడుతున్నవి. మనం తెల్పిన ఈ పరిణామాలను అంగీకరించేందుకు నేటిప్రజలు సంసిద్ధంగా లేరనేది విస్పష్టంగా తెలుస్తున్నది. స్త్రీ పురుషుల సమాగంతోపాటు ఎన్నో ఉన్నత భావాలు, సమస్యలు ముడిపడిఉన్నాయి. ఆటవికాలంలో అవి పూర్తిగా విస్మరింపబడ్డాయి. తర్వాత యూరపు ప్రారంభయుగంలో అవి కొద్దిగానే వికసించాయి. కాని యుద్ధకాముకత్వం తగ్గుతున్నకొద్దీ, కళలు వృద్ధిచెంది పరోపకారం, పరామర్శ (పైనచెప్పిన ఉన్నతభావాలు) మొదలైనవి ప్రజలలో నానాటికి వికసించుతాయి. ఇందుకు కారణం పరోపకారానికీ, పరార్థానికి మూలమైనసానుభూతే ఈభావాలకు, ఆశలకు మూలతత్వం కావడమే."